శ్రీ

# సంగ్రహ ప్రతాపరుద్రీయ

## నాటకము

[ రంగప్రతి ]

ప్రయోగానుకూలముగా

శాస్త్రి మనుమలచే

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారి

నాటకమునుండి సంగృహీతము

ప్రథమ ముద్రణము

ప్రకాశకులు

వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

స్వామిగుడినందు, లింగిసెట్టివీధి, మద్రాసు-1

1973



రు. 2-00

శ్రీ

# సంగ్రహ
# ప్రతాపరుద్రీయ నాటకము

(రంగప్రతి)

ప్రయోగానుకూలముగా

శాస్త్రి మనుమలచే

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారి

నాటకమునుండి సంగృహీతము

ప్రథమ ముద్రణము

ప్రకాశకులు

**వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్**

**4, మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీధి, మద్రాసు - 1**



రు. 2-00

## ప్రధాన పాత్రములు

ప్రతాపరుద్రుఁడు
యుగంధరుఁడు
జనార్దనుఁడు
విద్యానాథుఁడు
చెకుముకిశాస్త్రి
[illegible]
[illegible]రావు
పేరయ్య
పెద్దసెట్టి
ఢిల్లీసుల్తాన్
వలీఖాను
ఖుస్రూఖాను
ముస్తఫాఖాన్
ఫిరోజ్‌ఖాన్
ధర్మసింగు – ప్రతీహారి
దౌవారికుఁడు (మహమ్మదీయ)

### సహాయ పాత్రలు

నటీ, మార్దంగికాదులు, సిపాయీలు, వెఱ్ఱివాని శిష్యులు, వజీర్లు, గుమాస్తాలు మొదలగువారిని సందర్భానుకూలముగా సద్దుకొనఁదగును.

అంకములలో భాషితములను పద్యములనుకూడ తగ్గించుకొనవచ్చును.

ప్రతాపరుద్రుఁడు పేరయ్య పాత్రలు ఒక్కరు, యుగంధరుఁడు వెఱ్ఱివాఁడు పాత్రలు ఒక్కరు ధరించుట మంచిది.

# ప్రథమాంకము

స్థలము :—ఓరుగల్లు, నగరము వెలుపల కోటలో మంత్రికచ్చేరి.

[అంతట జనార్దనమంత్రి యుపవిష్టుఁడుగాఁ బ్రవేశించును.
పరివారము ఉచితప్రకారములఁ బ్రవేశించును.]

జనార్దనుఁడు.—[ఏమో వ్రాయుచు, చింతించుచు, ఆత్మగతము] చార దృష్టిచేఁ గని యూహించినది ప్రత్యక్షమే అయినది. వచ్చినవిధమును చిత్తగించుచుం జూడఁగా ఇది దాడియే, సంశయము లేదు. గడుసుఁదలఁచే నడుపుచున్నది. వీఁడు అన్నగారును ఏలినవారును లేని సమయముఁ జూచి వచ్చినాఁడు. వీనికి మంచి వేగు దృష్టియున్నది. వీనికి వేటికి సెలవిచ్చితినిగదా, రాని సర్వమును బయటఁబడును. అన్నగారు యాత్రకు వెడలినపుడు సవారి చెంతకు నన్నుఁ బిలిచి 'జనార్దనా, నీచేత రాజును రాష్ట్రమును, తొమ్మిదిలక్షల విలుకాండ్రను అప్పగించితిని, భద్రము.' అనిరి. ఈసమస్తమును అన్నగారికి మరల నప్పగించి వారి మెప్పు పొందఁగలనా? [వామాక్షిస్పందనము సూచించి] హా! ఏమి యీ యపశకునము! అప్పగింపను గాఁబోలుఁగదా!

ధర్మసింగు.—[ప్రతీహారుడు ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

జనా.—[ఆత్మగతము] ఆహా! ఏమి యీ శకునములు పరస్పరవిరుద్ధములు. తొలుత శ్రమ గలిగి పిమ్మట మేలు కలుగునఁట; ముందు హాలాహలము, పిమ్మట నమృతము. [ప్రకాశము] ఏమోయి ఏమి?

ప్రతీ.—తురకసర్దారులు వలీఖాను ఖుద్రూఖానుతోను ఒక జవానుతోను వచ్చి వున్నారు!

జనా.—మంచిది, తోడ్కొనిరా, ఇద్దఱనుమాత్రము.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నిష్క్రమించి వలీఖాను ఖుద్రూఖానులను తోడ్కొని వచ్చి] వారుగో మహామంత్రిగారు. [అని జనార్దనుని చూపును.

[జనార్దనుఁడు లేచి కొన్నియడుగులు వలీఖానునకు ఎదురు పోవును. వలీఖానుఁడును ఖుద్రూఖానుఁడును జనార్దనునికి సలాములు చేయుదురు. జనార్దనుఁడు బదులు సలాములు చేయును. నౌకరులు ఆగంతుకులకు రెండు కుర్చీలను తెచ్చి యుంతురు.

జనా.—కూర్చుండవలయును. [ముప్వురును కూర్చుందురు.

జనా.—కుశలమా మీ సుల్తానుగారికి? ఇంతదూరము ప్రయాణ శ్రమనోర్చుటకు కారణ ముండవలయును.

వలీ.—[మందహాసముతో] అల్లా కటాక్షంవల్ల మా యేలినవారు ఘయాజుద్దీన్ టొగ్లాక్ సుల్తానువారికి కుశలమే. తమ యేలినవారు ప్రతాపరుద్రమహా రాజావారికి కుశలంగదా?

జనా.—మా యేలినవారికి కుశలమే.

వలీ.—మేము వచ్చినకారణం గొప్పదే. మా సుల్తానువారికి కాబూలువాడికి పేషావర్ పర్గణా మాకే రావాలా మాకే రావాలా అని తక్రార్ గల్గి ఇద్దర్కీ నమ్కక్ అంగార్ అయింది. అటువైన కాబూల్వాడు మా ఢిల్లీ మీదకి దాడీ వస్తున్నాడు. ఈ సమయంలో తమ యేలినవారు స్వయంగా దండు నడుపుకొని వచ్చి సహాయ పడ్వాలా అని మా సుల్తాన్వారు నా నోటితో మనవి చేస్తున్నార్. తమరు మహా రాజా వారికి మాకి భేటీ చేయించి మా కోరికాకి నెరవేర్పించవాలా కోర్తాం.

జనా.—మీ సుల్తానుగారితో సఖ్యము మాకు సంతోషమే; కాని, మీ రాయబారమును గురించి కొన్ని సంశయము లడిగెదము, కోపము వహింపక తీర్చెదరా?

వలీ.—వినయత్వంగా తీర్చుతాం.

జనా.—

ఆ. సెలవు లేక మీరు సీమఁ జొచ్చుట యేల?
పగలు లెల్ల నడవిఁ బట్టు టేల?
దండు లేల? యొక్కదారి నంతయు రాక
చెదరి చెదరి యిట్లు చేరు టేల? ౧

వలీ.—అవశ్యం సమాధానం మనవి చేస్తాం. ఒకటి.—ముందుగా మీకి తెల్పడానికి మాకి ఫుర్సత్ లేకపోయింది. మా సుల్తాన్వారు 'ఓరంగల్లుమహారాజావారికి మనమీద చాలా దయా వుంటుంది, అంటే స్నేహం వుంటుంది, ముందు తెల్పకుండా మనుష్ వెల్లినా వారు ఏమీ అచ్ఛితించరలే, వెళ్లండి వెళ్లండి' అని మాకి చాలా తొందర పెట్టినార్. రెండు.—మేము చల్లనిదేశంనుండి వచ్చేటప్పుడు ఈ దేశంయెండానికి నిల్వలేక పగల్ నడ్వటం లేదు; రాత్రి నడ్వటం, పగల్ చల్లని నీడకోసం పొదల్లలో ముకాం చేయటం, సమాధాన మైందా?

జనా.—మంచిదిగాని, మూఁడవవిషయము,—మీ రాజ్యముపైకి దాడివచ్చు చుండగా, ఢిల్లీకి గొప్పసర్దార్లు మీరు రాజ్యము వదలి గొప్పదండుతో వచ్చుట ఆశ్చర్యముగా నున్నది. రాయబారమైన, ఒకరిద్దఱు గొప్పవారు కొంచెపాటి పరిజనములో వత్తురు, ఇంత రాణువ యేల?

వలీ.—మహామంత్రులవారు చిత్తగించవాలా. కాబూల్ కాడికి ఢిల్లీకి మధ్యలో ఎందర్ నవాబులు అందర్ ఎగిరిస్తార్. అందర్కి దాటు కోని వచ్చినా, మాకి మించిన సర్దార్లు మా సుల్తాన్వారి హజారంలో వున్నారు, వారికీ వుండే దండూమే ఈ హల్కా దండూ యేపాటి! ఇది వుంటే యెంత? లేకోపోతే యెంత? మేము వెళ్లవలసివస్తే [చిటికవైచుచు] ఎంతలో వచ్చినామో [చిటికవైచుచు] అంతలో వెళ్లతేమా! హల్లాకతాచ్చం చల్లగా మీదయా బాగా వుండితే మాకీ యేమీ తక్వా? ప్రతాపరుద్రమహారాజావారి చాలా గొప్పవారి అని, వారికీ పంపేది రాయిబారం హల్కా వుండకూడదు అని, మాతో ఈ కొద్ది రాజ్యాకి సుల్తాన్వార్ పంపినార్. మరి యీదారిని వెళ్లి ఖట్కంపట్టుకొమ్మని అందుకీ కోసంకూడా సుల్తాన్వార్ ఈలష్కర్ పంపినార్. అఖాబూగ్యాడికీ మన రాజ్యాలులో ఇంగువ సాలామిశ్రీ అమ్ముకొని బతికేలాగ చెయ్యవాలా అని సుల్తాన్వారిది సంకల్పం. అందుకీ కోసం యొక్క డెక్కడిది దండు జమా చేస్తా వున్నార్. మాకి ఇక్కడి పంపినార్. నాలుగు.—రస్తుసగఫాలు జరగకని చెదిరి చెదిరి వచ్చినాం.

జనా.—మంచిది గాని, వారిని సర్దారునిఁగా దండు తోడ్కొని రమ్మనెదవేమి? ఏమి యిట్టి రాయబారము తెచ్చితిరి?

వలీ.—లేదు అన్నగారూ, ష్ణేహంచేత సుల్తాన్వారు ఆ ప్రకారం కోరి నార్. పోనీ మహాప్రభువుగారు రాకోపోతే దండుకి సర్దార్లకి పంపితే చాల్.

జనా.—వారిని రమ్మనుమాట ప్రస్తావింపవలదు. వారముదినములలో తేటి తెలుఁగఁజేసెదము.

వలీ.—ఓహో ఆలాగయితే మాకీ చాలా ఆలస్యం అయితుంది. మేము ఇంకా ఖట్కానికి కూడ పోవాల వుంది. మా మీద చాలా దయాచేసి, మాకీ రేపే చేటికి శెలవిప్పించవాలా కోర్తాం.

జనా.—మా యేలినవారు ఇప్పుడు నగరమున లేరు, నేఁడో రేపో వత్తురు, వచ్చిన వెనుక మీరు దర్శనము చేయవచ్చును.

వలీ.—చాలా సంతోషం. తమవాళ్ళ గొప్పతనం మేము మా దేశంలోనే విన్నాం విన్నాం. ఇప్పుడు ప్రత్యక్షంగా చూచినాం. తమరు ఇంతా షులభులు అని మేము తలచలేదు. తమ పేరూ అంటే మా దేశంలో కూడా గడ్డగా గదా. ఈలాగ గదా మా దేశంలో బీబీలో జోల ల్పాడ్తార్.—

గేయము

వీరయుగంధర్ పేరు చెప్పితే నీరు విడుచు ఘోడా,
రుద్రయుగంధర్ ముద్ర పెట్టితే నిద్రపోదు హాథీ,
బాలయుగంధర్ లీల పల్కితే పేలదుర తుపాకీ,
సూరయుగంధర్ వీరము వింటే పారదుర ఫిరంగీ,
ప్రౌఢయుగంధర్ దాడి పాడుతా నేడవకుర బాబా.

ఇలాగా ఒళ్లు గుర్ పాద్యేలాగ పాడేసా మేము మా సుల్తాన్వారు విన్న మహా మంత్రి యుగంధరుల్వారికి దర్శనం చేసుకొన్న యీరోజే మా జన్మమిక్క మంచి రోజ్. ఇక మేము సెలవు పుచ్చుకోవచ్చునా?

జనా.— సాహెబుగారూ, నేను జనార్దనమంత్రిని. అన్నగారు కొంచెము ప్రయాణము పోయియున్నారు, త్వరలోనే వచ్చెదరు.

వలీ.—బలేబలే, వినివున్నాం. వారికి మించినవారు తమర్. అందుకే ఇనే నిదర్శనం. వారూ రాజా యిద్దరూ లేర్. మీరూవున్నార్. వారికి ఇద్దరికి మీకు వకురు సమానం, గనుకనే మీకి వకురికి వుంచి వారు ఇద్దరు వెళ్లినార్. ఇది మాకి చాలా మంచి రోజ్. ఇక మేము సెలవు పుచ్చుకొందుమా?

జనా.—చిత్తము. [అందఱు లేతురు.

ఖుద్రూ.—మనకి కొంచెం నౌకర్లకి చాకర్లకి తమరు సెలవిప్పించవాలా, మాకీ ఈ ఘోరం ప్రయాణంలో చాలామంది మధ్యమధ్య రోగం గీగం పడి మర్దయా అవినార్. తమరే మాకి యిక్డ కారంగోజాలు పడ్తుంది సెలవిచ్చినార్. మరి యిది మాకి కొత్త చోటు. కొంచెం హాజాములు, కొంచెం చాకర్లు దయచెయ్యవాలా కోరుతాం.

జనా.—మీ సరఫరాలు విచారించుటకు మా శిరస్తా విశ్వాసరావును ఏర్పరించెదము.

వలీ.—చిత్తము. మరి సెలవు.

ఖుద్రూ.—సలాం.

జనా.—సలాము, సలాము. [తురకలు నిష్క్రమింతురు.

జనా.—[కూర్చుండి] ఎవరోయి అక్కడ ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారి యాజ్ఞ ?

జనా.—విశ్వాసరావును రమ్మను.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

విశ్వాసరావు.—[వచ్చి] ఏమి దేవరవారి యాజ్ఞ ?

జనా.—విశ్వాసరావు, ఈ తురక లవిషయములో నీ యభిప్రాయ మేమి ?

విశ్వా.—ఈ తురకలరాక బలుమోసము; మనము మంచి జాగ్రత్తగా నుండవలయును.

జనా.—'సర్వయత్నేన తత్ కుర్యాత్ సింహో దేశం ప్రచక్షతే' అన్నట్టు సింహాక్రమణము చేయవలయును.

విశ్వా.—శరభక్రమణము గండభేరుండక్రమణము గూడ చేయవలయును.

జనా.—ఈ సమయములో అన్నగారిని రప్పింపవలసినదే.

విశ్వా.—తప్పకుండ.

క. ఆయన గాలిని బోనను,
[1]దోయముతో నలకుఁ బొగలతో గోడ లిడుఁగా,
ఆయనప్రయోగ [2]మభినవ
తోయజభవసృష్టి, [3]పెలది దుఃస్వప్న మగుఁగా.

జనా.—[ఇంచుక ఆలోచించి] మంచిది, ఇట్లు చేయుదము.—

విశ్వా.—ఏమి యాజ్ఞ ?

జనా.—ఈక్షణమే—[అనిసగములో] ఉండు చెప్పెదను. ఎవరోయి అక్కడ ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారి యాజ్ఞ ?

జనా.—సేనాపతి బేతాళనాయనింగారిని మేము చూడవలయును.

ప్రతీ.—దేవరవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

జనా.—విశ్వాసరావూ, ఈక్షణమే మన రాష్ట్రములో నాసిక మొదలు భద్రాచలమువఱకు గోదావరి దాఁటుటకు లేకుండ బల్లకట్లు డింగీలు మొదలగు సాధనముల నన్నింటిని పగులగొట్టింప వలసినది. పడవలు దోనెలు మొదలు లోనగు

---

3. 1, నీళ్లతో. 2, క్రొత్తబ్రహ్మసృష్టి. 3. ఇతరుల ప్రయోగము.

యానపాత్రముల నన్నింటిని భద్రాద్రి కవతల లంగరు వేయవలసినది. ఏప్రాణియు గోదావరి దాటఁగూడదు, దాటింపఁగూడదు. అతిక్రమణమున సంబంధించిన సకల జనులకు గ్రామగ్రామముగా తల కాజ్ఞ.—ఇట్లుగా రేవుల కన్నింటికిని, సంబంధించు నితరస్థలములకును, తాఖీదులు వ్రాయింపుము.

విశ్వా.—చిత్తము. [అని నిష్క్రమించును. జనా.—చింతించుచుండును.

ప్రతీ.—[సేనాపతిని దోడ్కొనివచ్చి] వారుగో మహామంత్రిగారు.

బేతాళరావు.—జయము జయము మహామంత్రిగారికి.

జనా.—[తిరిగిచూచి] బేతాళరావూ, కూర్చుండుము. ధర్మసింగూ, నీపని నీవు చూచుము.

బేతా.—[కూర్చుండి] ఏమి? ఈ మహమ్మదీయులరాకకై పిలిపించినారా?

జనా.—ఔను. మీసన్నాహ మెట్లున్నది?

బేతా.—సర్వసిద్ధము.

జనా.—బురుజులపై, అలంగములలో, సొరంగములందు, మాటులలో, గుహలలో, అంతటను దండు సిద్ధమా?

బేతా.—సిద్ధమే.

జనా.—దర్వాజాలకడ యంత్రములు, అగత్తియగుడులు, సర్వము సన్నాహములోనే యున్నవా?

బేతా.—ఉన్నవి. తమయాజ్ఞ యందినక్షణములోనే తురకశిబిరమును స్వప్నప్రాయము చేసివేసెదము.

జనా.—లక్షదండే గదా యిచ్చట నున్నది?

బేతా.—అయిన నేమి? అనుమకొండలోని లక్ష కోటకు కావు. కదను రెండు లక్షలకును నరసింహదేవరాయలకును ఇప్పుడే హెచ్చరిక పంపెదను. మఱి నామనవి.—నేను కోరఁగా కోరఁగా ఇన్నాళ్లకు యుద్ధప్రసక్తి గలిగినది. కాల్బంట్లు మొదలంకొని విన్నపము. యుద్ధమున కాజ్ఞ యీవలయు నని. నేనును ప్రార్థించుచున్నాను.—అటుపైని తమ చిత్తము.

జనా.—

ఆ. సంతసించెద కీవు సన్నాహమున నుండు,
మవసరమున [1]ముదల యంపువాఁడ,

---

1. ఆజ్ఞ.

అన్నగారు లేమి శ్రియవనీపతియు లేమి
శక్తులు గాక మనము కూల్త మరల. ౨

చేత.—చిత్తము. [అని నిష్క్రమించును. జనా.— జాబులు వ్రాయును.

విశ్వా.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

జనా.—విశ్వాసరావ్గూ, అంతయు సిద్ధమా ?

విశ్వా.—సిద్ధము. ఇవిగో తాఖీదులు, ఒక్కొక్కటియు అంచెలమీఁద చేరవలసిన తేది గడియ, జవాబు తెచ్చి ఇక్కడ అప్పగింపవలసిన తేది గడియ కూడ నమూదు. తమ మొహరు దయచేయవలయును.

జనా.—సంతోషము.

[అని మొహరిచ్చును. దూరమున జవాను ముద్రించును.

జనా.—[విశ్వాసరావుచేతికి ఒక జాబిచ్చును] దీనిని అన్నగారికి వేగిరావు టపామీఁద పంపవలయును. వారు వచ్చుటకు వేగిరావుటపా ఉంపవలయును. [మఱి యొక జాబిచ్చుచు] ఏలినవారికి దీనిని ఎచ్చట నున్న నచ్చటికి వెదకికొని పోయి యిచ్చునట్లు టపా పంపవలయును.

విశ్వా.—చిత్తము.

జనా.—తురకల నౌకర్లు చాకర్లును వలయునఁట ; ఎందులకో ఎఱుఁగుదువా ?

విశ్వా.—వేగుకొఱకు.

జనా.—మన వేగులను పంపుదము. ఈ వ్యవహారము ఇరుకకక్కడ గాఁదు పేఁడ తక్కడగాఁడుగా నున్నది.

విశ్వా.—అప్పుడే హెచ్చరించియున్నాను. సమ్ముఖమునకుఁ బంపుదుమా ?

జనా.—పంపు, అందఱును మనవాండ్రనే పంపు.

విశ్వా.—చిత్తము. అందఱు మనవాండ్రే. హిందూస్తాని చక్కఁగావచ్చిన వారే, వారిని తురకలకు చేయవలసిన నౌకరిలక్షణములతోనే పంపెదను. [జవానును నిర్దేశించి] ఏమోయి మొహ ర్లయినవా ?

జవాను.—అయినవండి. [అని తాఖీదు లిచ్చును.

విశ్వా.—సుదర్శనమునకు అంచులెన్నిరో యిన్ని. దానియంతవని నివియుచేయును. పోయి వీనిని రవానాచేసెదను.

జనా.—మంచిది. కానిమ్ము. [విశ్వాసరావు నిష్క్రమించును.

---

2. రాజు. 3. లోపములు. అరులకా కూల్త ము = శత్రువులను నాశము చేయుదము.

జనా.—[స్వగతము] ఇంక నేమి చేయవలయును? ఆ! జ్ఞప్తియైనది. ఒకప్పుడు అన్నగారు చెప్పియుండిరి గదా, మా చాకలిని పేరిగానిని చూపి, 'పరమమూఢుఁడైనను వీఁడు రాజుపోలిక వాఁడు, ఎప్పుడైన గొప్ప యిక్కట్టులో విశేషముగా నుపయోగపడును.' అని. వాని నీసమయములో మాయింటనే ప్రచ్ఛన్నముగా నిలిపెదను. అన్నగారు వచ్చి యుపయోగింతురుగాక.

జనా.—ఈ సమయమున మా సహాధ్యాయి శివముకిశాస్త్రిల తోడ్పాటు వలయుచుకొనవలసినదే.

[ నేపథ్యమున శంఖధ్వని ]

జనా.—అహో! శివ సమయ మైనది! ఇంక నిప్పటికి కచ్చేరి కరి.

[ముందు జనార్దనుఁడు వెనుక ధర్మనింగు నిష్క్రమింతురు.

---

# ద్వితీయాంకము

స్థలము :—ఓరుగల్లు, పఠాణీశిబిరము, వలీఖానుని డేరా.

[ అంతట వలీఖాను, ఖుస్రూఖాను, ముస్తఫాఖాను,
ఫిరోజ్‌ఖాను, ప్రవేశింతురు. ]

వలీ.—ముస్తఫాఖాన్, ఏలాగ యీదేశం పట్టడానికి నీకి యిష్టం?

ముస్తఫా.—సర్దార్‌సాహేబ్, రాజా వచ్చేతల్కి, మనము పట్నం పట్టిశేస్తే రాజా యిటుపైపు మరి రానేరాడు. ఖజానా మనచేతిలో పడి పోతుంది. రొువ్వలి దండూకి డబ్బులేక అడాయి శెయ్యడానికి వీలు వుండదు. అడ్డు అడ్డుగా మనము అన్ని పర్గణాలు కొట్టవచ్చును.

వలీ.—ఖుస్రూఖాన్, నీకి యిష్టం యేలాగ వుంది?

ఖుస్రూ.—సర్దార్ సాహేబ్, నాకీ యిష్టం యిది. పట్నంలో దండూ విస్తారం వుంది. ఖజానా విస్తారం వుంది, రస్తు విస్తారం వుంది. పఖషంవచ్చిగమైనా బైటిది దమ్మిడీ సామాను అక్కర్లేకుండ ముట్టడికి నిలుస్తుంది. అనుమకొండలష్కర్ ముట్టడి దండూకి చుట్టుకొంటుంది. నూటికి తొంభైతొమ్మిది దాన్ని రాజా స్వయం నడిపిస్తాడు. అప్పుడు మనఫతే హాదస్తుంలో వక్షగతి అవుతుంది. అందుచేత సాహేబ్ నాకీ యిష్టం యేమంటే, నువ్వు దండంతా నడుపుకొని, రాజా యెక్కడ వున్నాడు అక్కడ వెళ్లి, రాజాకి చేటకిచ్చింది కొంచెం వుంటుంది గనక, సులభంగా రాజాకి పట్టుకొని, దేశం హంతా స్వాధీనం వుచ్చుకొని, ఎంకొడ్డ యీ దంషుతో తమరునబాబ్ మేము గులాం వుండవచ్చును.

వలీ.—ఫిరోజ్ ఖాన్, నీకీ యిష్టం యేమి?

ఫిరోజ్.—ముందు రాజాకి పట్టి సఘాయి చేస్తే అంగ్రేజ్ సిగంగోలుకి పట్ట వచ్చును. రాజా హాసలే లేకుండా వుండే తప్పుడు, తమ్ముడు కూడా లేనప్పుడు, పెద్దమంత్రి కూడా లేనప్పుడు, యెవడూ యెకడికీకోషం యుద్ధం చేస్తాడూ? మనకీ రాజధాని పరగణాల్ దేశం పర్వం స్వాధీనం అవుతుంది.

వలీ.—మీరు వక్రు చెప్పినదానికంటే వక్రు చెప్పింది భాగావుంది. నా మతం యేమంటే—

దౌవారికుఁడు.—[ప్రవేశించి] సర్దార్ సాహేబ్, బొమ్మణ్ వక్షు వగ జానికి వచ్చివున్నాడు, 'కొంచెం వుండు' అంటే, 'వుండడం లేదు' అని గడ్బిడా చేస్తాడు. నేను అడ్డం నిలిస్తే నాకీ బైటి దర్వాజా అవతల పడేలాగ విసిరవేసినాఁడు. సాహేబ్, వాడు నూడడానికి బొమ్మణ్, తొయ్యడానికి సింహం వున్నాడు! నేనే పాడిచెయ్యవాలా వుంటానుగానీ...

[అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును]

చెకు.—పోరా, పూర్వసువాసినీ! నీవా నన్ను పోఁకుచువాఁడవు? [ఆత్మగతము] నేనే చెకుముకి నఁట, నీవోంట్లను వేనవేలను భస్మీకరింపనా? [అందఱను జూచి, వలీఖానునిఁ జూచి, ఆత్మగతము] వీ రందఱు నన్నుఁ జూచుటకంటె వీని ముఖము చూచుటయు. వీఁడే వీరిలో ప్రభువు. [వలీఖానుని నిర్దేశించి, ప్రకాశము] సలాము వలీఖాను బహద్దరుగారు, మీకు అఖండ దిగ్విజయము మున్నది.

చెకు.—మఱి నా దేమి వంశాయుల జోస్యము బెండశాయుల జోస్యము అనుకొన్నారా?

వలీ.—మీరు సెలవు లేనిది మా సభలోకి రావడం సరేనా?

చెకు.—ఓహో! ఏమి పరోపదేశపాండిత్యము. మీరు ఎవరి సెలవునిమాఁద వచ్చినారు ఈ ప్రతాపరుద్రుని రాష్ట్రములోనికి? ఎవరిపని వచ్చినప్పుడు వారు అలాగే అనుకొండి. చూచినారా నా జోస్యము దెబ్బ?

వలీ.—[ఆత్మగతము] అరే 'ప్రతాపరుద్రుని' అంటాడు. 'గారూ' చెప్ప లేదు, 'రాజా' చెప్పలేదు. ఇత డేమి ఆయునిక్ద్వేషుడా? [ప్రకాశము] శాస్త్రీ, మీరు సామాన్యపు జోస్యులు, ఏకాకి, మీకి యింత సాహసం మంచిది వుండ లేదు, పహారా జవాన్ పొడిచేసివుంటే మీ పని యేమై వుండును?

చెకు.—నేను సామాన్యపు జోస్యుఁడనుం గాను. నాకు మాన్యాలు లేవు. సంపాదించుకొనుటకే మీ దగ్గఱకు వచ్చితిని. నేను ఏకాకినిం గాను, పోలీస్ కన్న పోను. పొడిచేసిన పొట్లము దమ్మిడి. నేనే యమధర్మరాజనే నన్ను పొడిచేయుం వాఁ డెవఁడు? నామీఁద మొదట ఆయుధములు ప్రయోగించువారు ఐదుగురు నాచే చత్తురు. వారిచే నేను చావను అని నా జాతకము. ఆ పైమాట చూచుకొందము. పంజా పట్టిన, నేను విఱిచినచేయి ఎప్పటికి కుదురునో నేనే చెప్పగలయుఁగిదా.

వలీ.—[కుతూహలముతో] అయితే సాస్తుర్లూ, మీరు వచ్చినపని యేమో తచ్ఛనం చెప్పి వెళ్లండి, మేము జరూర్ పనిలో వుంటాం.

చెకు.—ఇంతేగదా మీ శక్తి? నా పని మీకు తెలియదు. మీ పని నేను చెప్పెదను, చూడుఁడు—'రాజును ముందు పట్టుదుమా, రాజధానిని ముందు పట్టుదుమా?' అని మంత్రాంగము చేయుచున్నారు.

[ఖానులు ఒకరి ముఖ మొకరు చూచుకొనుచున్నారు.

చెకు.—మఱి నేను వచ్చినపని చెప్పుదునా?

వలీ.—చెప్పండి సాస్తుర్లూ చెప్పండి.

చెకు.—[దౌవారికుని నిర్దేశించి] వీని నవలికి పొమ్మనుఁడు, లేదా, నేను పంపుదునా?

వలీ.—జావురే జావు. [దౌవారికుఁడు నిష్క్రమించును.

చెకు.—[దౌవారికు నుద్దేశించి] ఓరీ, ఇఁక చెప్పుదును సన్నద్ధుఁడ. తమను ముందుగా నానొక ఖరారు చేయవలయును. నాకు ప్రాణముమీఁద ఆశ లేనే లేదు గాని,

ఖానులు.—[ఆత్మగతము] అది తెలుస్తూనే వుంది.

చెవ.—మానముమీఁద మాత్రము ఆశ బలిష్ఠము.

ఖానులు.—[ఆత్మగతము] అదిన్ని తెలుస్తూనే వుంది.

చెవ.—జోస్యము రెండు భాగములు, సిద్ధాంతము విద్ధాంతము అని. అందులో నేను మొదటి భాగము మాత్రమే చదివితిని. ఈ ప్రతాపుని జోస్యుఁడు రెండవ భాగము మాత్రమే చదివినాఁడు.

వలీ.—[ఆత్మగతము] మళ్లీ 'ప్రతాపుడు' అని బలే మాగౌరవం చేస్తాడు!

ఫిరోజు.—మీ రెండువు రెండుభాగాల్ సద్వకండా జోస్యం చెప్తానికి వస్తారు మాకాడికి?

చెవ.—రెండవభాగము చదివినయెడల మీ దగ్గఱకు ఎవరు వత్తురు?

ఖుస్రూ.—ఆ రెండోభాఘం మాకీ పన్కిరాదా?

చెవ.—మఱి అదేమో దాని స్వరూపము చెప్పెదను, పనికివచ్చునో రాదో మీరే తెలిసికొందురు.

వలీ.—శాబ్బాస్! చాప అని మునలినోట చెయ్యి పెట్టినాం. [శాస్త్రి నుద్దేశించి] మీ గనక రెండోభాఘం అంతా ఇక్కడ వప్పగిస్తారా యేమి సాహుబ్లూ?

చెవ.—ఆ రెండవభాగము నాకు రాదయ్యా అనుచుండఁగా దాని నప్పగించెదనని భయపడెద రేమయ్యా?

వలీ.—షాబాస్ షాబాస్! అయితే చాలా సంతోషం. అది మా భాగ్యం.

చెవ.—ఆ రెండవభాగ మేమనఁగా?

వలీ.—మళ్లీ ఆ రెండోభాఘం ఆరంభించినావే సాహుబ్లూ!

చెవ.—ఆమాట్య, రెండుమాటలు విని తర్వాత ఆక్షేపింపుము.

వలీ.—మఱి యేమిగతి? కానీ.

చెవ.—ఆ రెండవభాగము మొదటిభాగమును ఖండించును, మొదటిభాగము రెండవభాగమును ఖండించును, రెండును వదలినవానికి ముక్తము జోస్యమునున్న.

వలీ.—వాల్లా! వాల్లా!

చెవ.—శివ శివా! శివ శివా!

వలీ.—సాహుబ్లూ, మాకి ఆ ముక్తం సున్న చెప్పి వెల్లండి, చాలును.

చెవ.—అట్లే చేసెదను. ఒకటొకటిగా చెప్పి ముక్తము చేసి సున్న చేసి పోయెదను. కనుక, విను, ఆ రెండవభాగము మరల రెండుభాగాలు.

వలీ.—హల్లా! హల్లా! ఏమి గహచారం వచ్చిందిరా యీరోజ్!

చెకు.—శివశివా! శివశివా! ఏమి యోగదినమురా యీ దినము! ఆ రెండు భాగాలు ఏవనఁగా—(1) ఉన్నదిలేనట్లు చెప్పుట. (2) లేనిది ఉన్నట్లు చెప్పుట.

ఖానులు.—[ఆశ్చర్యపడి, కడుపులు పట్టుకొని నవ్వుచు] అరే బలే తమాషా బొమ్మన్! బలే తమాషా బొమ్మన్!

చెకు.—తమాషా బ్రాహ్మణుఁడను నేను గాను, తమాషా బ్రాహ్మణులు మీ దేశపు గౌడబ్రాహ్మణులు.

ఖానులు.—కానీ పండత్ సాబ్.

చెకు.—మొదటిభాగ మేమనఁగా, అదియు రెండుభాగాలు.

వలీ.—(1) ఉన్నది ఉన్నట్లు చప్పడం, (2) లేనిది లేనట్లు చప్పడం, అదేనా సాస్తుర్లూ సాబ్?

చెకు.—సందేహ మేమి? ఆహా! ఆవులించినఁ బ్రేవులు లెక్కపెట్టు బుద్ధి గాని సామాన్యమా! మఱి మొదట అవసరపడ్డారేమి? ఇది సిద్ధాంతము. అది విద్ధాంతము.

ఖానులు.—అచ్ఛా! అచ్ఛా!

చెకు.—మఱి యిప్పుడు చెప్పండు, మొదటిది మాని రెండవది మాత్రము చదివి వచ్చిన మీకు పనికి వచ్చునా?

ఇత.—ముష్వ.—నహీ నహీ.

చెకు.—మఱి నేను కోరుకోరికను మీరు నెఱవేర్చినను మానినను సరియే గాని, నేను మీ కడకు వచ్చుట ఈ పట్టణమువారి కెవ్వరికిని ఈ గోష్ఠి మీ యింటి ప్రాణికి ఎవ్వనికిని మీరు తెలియనీయఁగూడదు. ఇది నేను కోరునది. ఈ ఖరారు మీరందఱుచేసిన, నా కథ నేను క్షణములో ముగించిపోగలను. పహారా జవానును నేనే సర్దుకొనెదను లెండు.

ఖానులు.—ఖరార్ సాస్తుర్లూ, ఖరార్, మేం ఎవరికీ చెప్పం.

చెకు.—మఱి వినుండు. ఆస్థానపు జోస్యుఁడు అది చదివినాఁడు. ఈ స్థానపు జోస్యుఁడను నేను ఇది చదివితిని. ఇందువలన అతనికి నామీఁద బహుద్వేషము కలిగినది; మనస్సులోనే దాఁచుకొన్నాఁడు '[illegible]' అని యెదా? నేను ఆఱు సంవత్సరాలు అతని నాశ్రయించితిని, రాజదర్శనము చేయింపుమని. చేయించినాఁడు గాఁడు. ఒక నాఁడు తెగఁబడి రాజా సెదుటికిఁ బోయి ఆశీర్వచన

శ్లోకము పఠించితిని. అంత నతఁడును ఈ జోస్యుని మాటమీఁద నన్ను 'ఏమి యీ బోడి బాపనవాని సాహసము!' అని తిట్టినాఁడు. అంత నేనును 'బోడియే నీ పొగ గణించును లే!' అని ప్రతిజ్ఞ చేసి వెడలి వచ్చితిని. బ్రాహ్మణుఁడనని రాజు నన్ను నుపేక్షయు చేయలేదు. యమధర్మరాజనని బంట్లెవ్వరును నా మీఁదికి రాలేదు. మీరాయ మహాప్రౌఢులు, 'ముందు నీకీ యవమానప్రాప్తి జోస్యమువలన తెలియలేదా?' అని యడుగరేమి?

ఇత. ముప్వ.—అచ్ఛా! అచ్ఛా! అదే బడ్డనాలా వుంటాం.

చెప.—ముందు తెలిసినందున నే తప్పదుగదా అని పోయి అనుభవించితిని.

ఇత. ముప్వ.—అచ్ఛా! అచ్ఛా! వహవ్వా! వహవ్వా!

చెప.—నా ప్రతిజ్ఞ కూడ జోస్యమువలన చేసినదే.

ఖానులు.—అచ్ఛా! అచ్ఛా!

చెప.—మఱి నా ప్రార్థన యేమనఁగా,

క. మీ రేఁ జెప్పెద జోస్యము,
నాటఁగ సుల్తానుదర్శన మిడుఁడు మీరల్,
లోకేశు నతని గాని నే
నీ [1]కుటిలమతుల [2]వెలార్తు నిర్భర [3]సుడిలోన్. ౩

ఇత. ముప్వ.—[సచమత్కారము] మీకీ మేం జోస్యులూ వుంచుకొంటే మాకి సిద్ధాంతం జోస్య చెప్తాం, లేకపోతే దాని పేర రాలేదు, అ గండభాగం చెప్తాం"?

చెప.—ఆహా! ఆహా! మీ సేమిరయ్యా క్షణములో నే యింతపరాకు? ఆ గండవభాగము నాకు రాదయ్యా!

ఖుల్గరా.—ఔను, ఔను. అచ్ఛా, అచ్ఛా.

వగీ.—మంచిది. మీకీ మేం అవలంబిస్తే మాకి యేమి ప్రయోజనం? మీరు జరిగేది చెప్తారు. దానిచే ముందు మేం ఎరిగినా అదే జరుగుతుంది, ఎరగకా పోయినా అదే జరుగుతుంది. మీ జోస్యంవల్ల మాకి యేమి కిఫాయత్?

చెప.—అటయిన జరుగనిదానిని చెప్పగలరయునా? ముందు తెలిసిన ఆసంతోషమే ఆశ్చర్యమే ఫలము. మఱి,

ప. 1. దుష్టబుద్ధులను. 2. నాశముచేయుదును. 3. మాటలో-క్షణములోననుట.

మ. నను రక్షింపఁ దలంచి డాయను మిము, న్నాకింక మేలేయగుఁగా,
బనిగొందు న్నరపు భక్తుఁగా నతఁడు న న్పాటించుఁబో వేల్పుఁగా,
మును ము న్వానికి నన్ని జోస్యపువహిం బోధించి యాప్తుండనై,
వెనువెంటం మెడఁబట్టి గెంటెదఁ జుమీ సిద్ధాంతి రాద్ధాంతినై. ౪

వలీ.—అప్పటికి మీ ప్రతిజ్ఞ అబద్ధం కాదా?

చెను.—అ దెట్లు? నాకు పాదాక్రాంతుఁ డయిన, బోడివలన పొగ రణఁ గుట కాదా? బోడిబాపనవాఁ డని నన్ను తిట్టలేదా? నాకు సిద్ధాంతము రానిమాట క్షణక్షణములో మీకు పరా కౌను గాని, మీరు ప్రశ్నలుమాత్రము కడు చాక చక్యముగా వేయుచున్నారు. చెప్పుఁడు మరి. 'బోడి పొగ రణఁచు' ననఁగా యెవరని యర్థము చేసెదరు?

వలీ.—ఊర్కే మాటవరసాకీ చెప్తాం, ఎవ్వరైనా తురకలే రెయింగుకు కాదు?

చెను.—బోడిబాపనవాఁడను గాన మొదలు నే నొకబోడిని; నాకన్న మీరు బోడి, నాకు జుట్టున్నది, మీకు అది లేదు; మీకన్న మా సన్యాసులు బోడి, మీకు గడ్డమున్నది, వారికి అది లేదు; అందఱకన్న మా పూర్వసువాసినులు బోడి, వారికి గడ్డము మొలకనే మొలవదు. ఇందఱిలో ఆ జోస్యపుబోడి యేబోడి గారాదు?

వలీ.—మీతో మేం మాటాకి మాటా చెప్పలేం సాస్తుగ్గా.

చెను.—కనుక, నాతో వాదము పెంపకుఁడు. ఏబోడియో నే నిప్పుడు చెప్పను. నన్ను మీ రవలంబించెద మని ఖరారు చేసిన, అప్పుడు మీనము మేషము గుణించి చెప్పెదను; చేయనియెడల రెండవమార్గమును చెప్పనే చెప్పితిని. అయిన మీకు ఓడినను మిమ్ము గెలిచినను నాకు పాదాక్రాంతుఁ డగుట తప్పదు.

వలీ.—[జనాంతికము] ఖుస్రూఖాఁ, ఇతడు మనకీ పనికి వచ్చునా?

ఖుస్రూ.—[జనాంతికము] బలేసామర్థ్యుడు, రాజాకి ద్వేషి. మనవల్ల గొప్ప కార్యం కోరినాడు, మనం ఖరార్ చేస్తే మనపచ్చం వుంటాడు, అక్కడివి సంగతులు శీదా మనకీ చెప్తాడు. ఈ డోబీలు హాజామ్లు ఇతనిముందర ఏపాటి?

వలీ.—[జనాంతికము] అటయితే వుంచుకొందుమా?

ఖుస్రూ.—[జనాంతికము] నామతం అదే.

ముస్తఫా ఫిరోజులు.—[జనాంతికము] మా మతం కూడ అదే.

చెన.—సమ్ముఖమున రాయబార మేమి? ఇంక మీ యాలస్యమే గాని నా యాలస్యము లేదు. నన్ను పంపివేసి మీపని మీరు చూచుకొనుఁడు.

వలీ.—సాస్తుర్లూ, ఏబోడీ అయితే మాకే మేమి? మేం మహారాజావారితో స్నేహానికి వచ్చినాంగాని లడాయికీ రాలేదు.

చెన.—నాదగ్గఱనా టక్కులు? పాపము! మీరు రాజమిత్త్రులు. రాజస్నేహని నన్ను చేర్చుకొన సంకోచించుచున్నారు! నన్ను తమాషాబ్రాహ్మణుఁడన్నారు. మీరెంత తమాషా సాయెబు లయ్యా?

వలీ.—[జనాంతికము, ఖుస్రూతో] ఇతడు బలే దుర్మర్గుడు, బలే పగపట్టే వాడు, మనం తిరస్కారం చేస్తే మన సరంజాం లడాయికి అని యితనికి యిప్పుడే తెలిసేవుంది గన్క వాళ్లకీ చెప్పి వాళ్లకీ మన్మిదికి తయ్యారు చేస్తాడు; అందుకోసం యితనికి మనపచ్చంలో వుంచుకోవడమే సరి, అనీ మాకీ తోస్తుంది.

ఇత. ముప్వ.—అచ్ఛా, అచ్ఛా.

వలీ.—సాస్తుర్లూ, మీరు మాతో భాయిభాయి వుండవాలా. మీరు అడ్గిన దంతా మేం చేస్తాం, మీరు సరీ స్నేహ్యం చస్తే మీకి బంగారంలో పాతీయేస్తాం. దుష్మాటంస్నేహ్యం చస్తే మట్టిలో పాతీ యేస్తాం.

చెన.—'నిప్పులో' అనుఁడు. మట్టిలో పాఁతుట తురకలనే.

వలీ.—పోనీ, అలాగే కానీ.

చెన.—నేను మీ బంగారముకోసము రాలేదు, మఱి నేను సరిసోస్యము చెప్పిన, నాకు సుల్తానువారి దర్శనము మీరు చేయింపకపోయిన, మీ కేమి నియమము? నా రాక నిచట బయలుపుచ్చినను, అందుల కేమి నియమము?

వలీ.—మీరే కోరుకోండి.

చెన.—కోరినట్లు ఒప్పుకొందురుగదా, మాట తప్పరుగదా?

ఖానులు.—మేము మాట తప్తామా?

చెన.—అటయిన మీ రయిదుగురు ప్రత్యేకముగాని కలసిగాని నాతో కత్తియుద్ధము చేయవలసినది. [ఖానులు ముగములు చూచుకొందురు.

చెన.—మఱి తప్పదు.

వలీ.—ఖరారు. అలాగే మీతో యుద్ధం చేస్తాం.

చెన.—వారినోట రాలేదే ఆమాట.

ఇత.—మువ్వు.—ఖరారు, అలాగే మీతో యుద్ధం చేస్తాం.

చెన.—మతి రండి, భాయి భాయి భాయి, భాయి. [అందఱచేతను చేతంజేయి వేయించుకొని] మతి యీ చాకళ్ళను మంగళ్ళను నేను తెలియఁగూడదు. సగము దారిలో వేషము మార్చుకొని తురక వేషమున వచ్చి తురక వేషమునను వెడలెదను. నాకు తురకదుస్తు తెప్పింపుడు భాయి.

వలీ.—అచ్ఛా బహద్దర్! అచ్ఛా బహద్దర్ మేమే ఆ పని చెయ్యవాలా వుండింది, మాకీ మీగడ్డిబుడాలో ఏమితోచలేదు, బాగా జ్ఞాపకంచేసినార్ సాస్త్రుగ్గు.

చెన.—శాస్త్రులు అనకుఁడు, భాయి అనుఁడు,

వలీ.—అచ్ఛా అచ్ఛా! బాగా జ్ఞాపకం చేసినార్ బడాభాయి.

[అని స్వయముగా పోయి మేలుతురకదుస్తు తెచ్చి సెనమునకు ప్రీతిగ నొసంగును.

చెన.—[ఆత్మగతము] ఇట్లు సద్యఃఫల ముండవలయును. [ప్రకాశము] ఇఁక మీకు నావలన నాలస్యము వలదు. నేను మీకు భాయినే గాని నౌకరను గాను గదా, నాయిష్టమైనప్పుడు మీ దర్శనాలకు వచ్చెదను. ఇప్పటికి సెలవు. సలాము, సలాము, సలాము, సలాము.

ఖానులు.—సలాం.

వలీ.—ఖరార్ చేసినాం, భాయి అయినాం; ఆ జోస్యపుబోడి దెయిదగా చెప్పండి భాయి.

చెన.—[సోత్ప్రాసము] మీరు సఖ్యానికి వచ్చినారు గదా. జోస్యపుబోడి యేబోడియైన మీకేమి? [అని నిర్గమించుచు, పహరాజవానుం గని] ఏమిరోయి [తన దుస్తుచూపుచు] నాదెబ్బ చూచితివా? ఇం కొకమాటు పంజా పట్టెదవా? పోనీ, నాతోఁకొంచెము కత్తి త్రిప్పెదువా? విక్రమార్కుని బట్ట కుఱ్ఱగుని నోఁ బడిన, నీబుఱ్ఱ గిఱగిఱ తిరుగుచు, నన్ను వెక్కిరించుచునే శే, పోయి ఖిల్లీలో నీ పెండ్లాము నోడిలోఁ బడును.

జవాను.—సలాం పండత్ సాబ్, సలాం.

చెన.—ఆ, అట్లు పలుకు. ఇప్పుడు బుద్ధిమంతుఁడవు.

[అని నిష్క్రమించును.

ఇత. మువ్వురు.—ఇత డెవరో అసాధ్యుడు సర్దార్సాహెబ్!

వలీ.—ఔను. ఇతడు మనపచ్చంవుంటే జనార్దనుడికి సాధించవచ్చును. ఇతడు మళ్లీవస్తే మనపచ్చం వుంచడానికి జాగర్తగా చాలాస్నేహం చెయ్యండి.

ప్రస్తుతం యితని జోస్యంవల్ల మనకి మేమీ ప్రయోజనం లేకపోయింది. ఇతడు యెప్పుడు వస్తాడో, వస్తాడో రాడో కూడ తెల్వదు. ఇతనికి యెదురుచూచి మన యేర్పాట్లు మానడం మార్చుకోవడం బాగా లేదు. గనక మా యేర్పాట్లు యేమంటే—

ఇత. ముప్వ.—సర్దార్, శెలవియ్యవాలా.

వలీ.—పట్ణం పట్టడం మనకి అసాధ్యం. కనక మేం కొంచెం దండుతో జంగల్కి వెళ్లి, రాజాకి ఖైదీపట్టి ఢిల్లీకి వెళ్లిపోతాం. మీకి కభర్ చేస్తాం. మీరు తవ్వనం ఖుస్రూ సర్దార్ వుండి పట్ణం పట్టుకోండి, పగ్గణాల్ పట్టుకోండి; రాజా వచ్చి మేము రాకపోతే అంయాఖరం జరపండి. పైయాలోచన మీకి తెల్సును. ఇంతలో మేం కల్సుకొంటాం.

ఇత. ముప్వ.—అచ్ఛా, సర్దార్చిత్తం.

వలీ.—మేం లేనప్పుడు ఖుస్రూ సర్దారు, దేశం గీశం పడ్తే ఖుస్రూ నబాబ్. మా ప్రయాణానికి సరంజాం చేయించు ఖుస్రూఖాన్. ఇక కచేహరి మర్తబ్.

ఖుస్రూ.—ఇప్పుడే సరంజాం సిద్ధం చేస్తాను.

ఇత. ముప్వ.—సలాం సలాం.

[అందఱు నిష్క్రమింతురు.

---

# తృతీయాంకము

[అంత మఱ్ఱిచెట్టుక్రింద నిద్రితుఁడు రాజు ప్రవేశించును.]

[నలువురు సిపాయీలు రాజునకు కాలుసేతుల బంగారు సంకెలలు తగిలించి ఆయుధములను తీసి పైకుగు.

రాజు.—[చేతులు కాళ్ళు దులుపుచు మేల్కాని లేచి కూర్చుండి] ఏమి యీకల! మా కాలుసేతులు నాగుబాము చుట్టుకొన్నట్టు స్వప్నమైనది. [చేతులు

కాళ్లు చూచుకొని మహాశ్చర్యముగా] ఏమి యిది! పాము గాదు, బంగారుసంకెలలు! ఏమి యిది! ఇంకనుం గలరే? [కలయఁ జూచి సిపాయీలం గని] ఏమిరా యిది? మీ రెవరు?

సిపాయీలు:—[దద్దరిల్లి వెనుకకు విఱుగఁబడి సరుదుకొని] మహారాజా సాహేబ్, మేం వలీఖాన్ సిపాయీలం మా సర్దార్ హుకుంచేత ఈపని చేసినాం.

రాజు.—ఏమీ! [కత్తి దూయం బోయి, బాకు తీయం బోయి, లేమిని చేతులు రామిని ఎఱిఁగి] ఏమిరా అఁడుదానిపని చేసినారు? మీ ఖాను ఉన్నాఁడా యిక్కడ?

సిపాయీలు.—ఉన్నారు మా సర్దార్.

రాజు.—ఇక్కడికి రమ్మను.

జమాదార్.—సర్దార్తో చెప్తాక్ మహారాజాసాహేబ్. [అని నిష్క్ర

రాజు.—మాగుఱ్ఱ మేదిరా?

సిపాయీలు.—గుఱ్ఱాన్కి పట్టి ఖయిద్ చేసినార్ మహాప్రభో.

రాజు.—ఖయిదు పడదే అది?

సిపాయీలు.—మాకీ తెల్వాదు మహారాజ్.

రాజు.—ఓరీ, ఈవలీని కొలిచిన మీకు పిడికేఁడు గొట్టెకన్న లే మున్నది? [సంకెలలను సూచించి] వీనిని వదలించి, మాతో గండి, చాటుదారులఁ బోదము. మీకు చెఱియొకపరగణా యిచ్చి మిమ్ము నవాబులను చేసెదము,

[సిపాయీలు మొగ ముగాలు చూచుకొనుదురు.

జమా.—[మఱి నలువురు సిపాయీలఁ దోడ్కొని వచ్చి] రండి మహారాజ్, రండి మా సర్దార్ దగ్గాకీ.

రాజు.—మేము రాము. మమ్ము పొడిచి వేయుఁడు.

జమా.—మాకీ పొడ్వడాన్కి హుకుం లేదు. తీస్కొని రమ్మని హుకుం.

అందఱు.—రండి మహారాజ్ రండి. వచ్చి అక్కడ సర్దారుకు అడ్గితే వారు విడిచిపెడ్తార్.

రాజు.—మీ సర్దార్ దొంగ, మీ సర్దార్ ఆఁడుది; వాని ముఖము చూడ మాకిష్టము కాదు.

జమా.—ఇష్టం లేకొపోతే కష్టం వుంది. మీరు తిగ్గబాట్ చేస్తే ప్రయోజనం లేదు. మీ ఢౌలత్ పోయింది. మీరు మా ఖయిదీ. మేం రమ్మంటే రావాలా. పొమ్మంటే పోవాలా. మీరు రాకోపోతే మేము ఇద్దరు నల్గురు మంది జులుం చేసి

మీకే పట్టి యిచ్చుకొని పోతాం; అది మహారాజాకి బలే గౌరవం! మర్యాదగా రండి. తమరికి అక్కడ మర్యాదా సర్దార్ ఖుషి, తమరి అదృష్టం.

రాజా.—మీకు మనిసికి ఒకసర్కా రిచ్చెదము. [కాలు సేతులునూచించి] వీనిని వదలించి మాతో రండి.

[సిపాయీ లందఱు మొగమొగంబులు చూచుకొనుదురు.

[దూరమున చెట్లచాటునుండి వలీఖాను తొంగిచూచు చుండును.

జమా.—[వలీఖానుం బొడగాంచి] అరే సర్దార్ దేఖ్తారే.

అందఱు.—[వలీఖానుం గని, రాజుతో] మేము నమ్మక్ ద్రోహం చెయ్యం మహారాజ్.

రాజా.—అట్లైతే మా గుఱ్ఱమును తెండి, దానిమీఁద వచ్చెదము.

నాయుడు.—అచ్ఛా! అచ్ఛా!

జమా.—[సతిరస్కారము] గిచ్ఛా! గిచ్ఛా! ఆ గుఱ్ఱం మీద కూచున్న గనుక్కే గాలంలో అది పోరుగల్లమే వుంటుంది, మన్మ యిక్కడ జంగల్మె వెనుకగా వుంటాం. పేరగుఱ్ఱం తెండి. [ఆలోచించి] వద్దు, టాంజాను తెండి.

[సిపాయీలు రాజును నడపింతురు.

రాజా.—[స్వగతము] హా! ఈపాటు నాకుఁ బాటిల నేమి కారణము!

ఉ. కల్ల వచించినాఁడనో? విఘాత మొనర్చితినో సురార్చకుల్?
దల్లమనంబు సేయనో? యదండ్యుల దండన వెట్టినాఁడనో?
[1]యుల్లము నొంతునో ద్విజున? [2]కక్కోటినో యార్తుని? వింటినో ఖలుల్?
బల్లిద మైన [3]వైశసము పొటిలఁగాఁ గత మేమి యీ క్రియన్? ౧

అట్లు గాదేని,

క. అటవి నిరపరాధల మృగ
పటలం బొరిగొన్న పాతకము దాఁకెనొకో?
చటచటఁబడిలో వేఁటకుఁ
బటుయోగాదృత్యులై తపము సేయుమునుల్? ౨

హా! లక్ష్మి యంట! యెంత మోసగత్తియ!

౧. 1. హృదయమును బాధింతునో. 2. ఓమనోహరక్షింపనో, 3. చేటు.

ఉ. అంచెల వైరులన్ దునుమున న్నసిధారను దోడు నిల్చి, ప్రే
మించి, కవీంద్రభాషణల మెచ్చుతఱిన్ గనుసన్నఁ గొల్చి, న
మ్మించి, యకాండ మిష్ట విషమించి, త్యజించెను సుప్తుఁ గానలోఁ
[1]జంచలకన్నఁ జంచల నిజంబుగ లచ్చి, యిదే గ్రహించితిన్. ౩

ఉ. నాకథ విన్న నే మగునొ నా[1]జనయిత్రి? [2]మదీయరక్షణే
చ్ఛాకలితవ్రతాకృతి కులాంగన యేగతి నొంది తిందునో?
రే కిడుతమ్మిమొగ్గ[3] కెలరేదొరబుగ్గరు నాదుపట్టికిన్
గాకతివంశవీరునికి [4]గంజజుఁ డేమిగతిన్ లిఖించెనో? ౪

ఆ. కూలినాలి చేసి కుడుచు పేదసుఖంబు
దక్కదిలను [1]మకుటధారి కెపుడు;
తలకుఁ దాఁక కున్నఁ దన కేమి తెలియదు,
ఫలముఁ గంటి రాజభావమునకు. ౫

హాహా! ఏమి తోఁచుచున్నది! నాగతి ఢిల్లీనడివీథులలో బోనులో దూరీగింపు! హాహా
ణము మేలుగదా! అహా! ఎట్టి కులపాంసనుండను బుట్టితిని! ఓరి నన్నెట్లు క్షమింతువు!

చ. శుకముల, గోరువంకల, వసుంధర లాతివిహంగమంబులన్,
[1]మెకములఁ బంజరాన నిడు మిక్కిలివేఁటరు లుందు [2]రెందఱో,
వికలితవైరి నేకశిలవీరనరేంద్రునిఁ బంజరంబులోఁ
బ్రకటితశక్తి నిట్లిడిన [3]వ్యాధశిఖామణి వీ వొకండవే!
అహా! హతవిధి! ఈమలకలు నాదేశ మేల చొరవలయును!

క. కొలలు, న్గొల్లలు, చెఱలున్,
జెలువలఁ జెఱచుటయు, జాతిఁ జెడఁగొట్టుటయున్,
[1]మలకలచే నాప్రజలకుఁ
గలుగవె? యాపాప మెల్లఁ గలుగదె నాకున్? ౭

---

౩. అసిధారన్ = కత్తి వాదరయందు. 1. మెఱుపుఁదీఁగకంటె.
౪. 1. తల్లి. 2. నాసేమమందలి కోరికచేత నోఁచబడు నోములే ఆకా
రము గాఁగలది. 3. బాలచంద్రుని చెక్కిటివంటి కోమలాంగునికి. 4. బ్రహ్మ.
౫. 1. కిరీటము దాల్చినవానికి – రాజునకు.
౬. 1. మృగములను 2. వేఁటరులలో శ్రేష్ఠుఁడవు.
౭. 1. తురకలచేత.

ఆహాహా! ఈపాటున కెల్ల నాదోషమే మూలము. ఆ మహామహుఁడు యుగంధరదేవుని పలుకుఁ బాటింపక వేఁట కరిగిన ఫల మిది. మహానుభావా, మీ తలంపుచేఁ కడు లజ్జితుండ. నా తప్పుచే విధి బలీయ మైనది. విధినడంచు పురుషకారము తమదే! ఇప్పటి కిటికి గ్రత్యశాజ్ఞానము కలుగుచున్నది.

ఉ. చింతిల నేమి గల్గు? విధి [1]చేఁత బలీయము! తొంటికర్మముల్
శాంతిలు [2]భుక్తిమాత్రమున; [3]సత్త్వవిహీనత నొంది యాక్రియన్
[4]వంతలఁ బొక యింతులకు [5]వాటము, తేఁకువ నూపుమార్గమున్
సంతతధైర్యవృత్తి నిట [6]శత్రువశంవదత న్మెలంగెదఁ. రా

[చూడ్కి సారించి] అహో గోదావరి అగపడుచున్నది! నమో నమస్తే సాగరసహధర్మచారిణీ!

[అందఱు నిష్క్రమింతురు.

స్థలము 2. గోదావరిగట్టు

సిపా.—పడవల్, డింగీల్, దోనెల్, వాడల్, అన్నీ వున్నయి! మనకోసం వాళ్లా పంపినాఁడా యివి! యేమిరా మన హాద్రుష్టం, మన సర్దారి హాద్రుష్టం?

[అంత వలీఖానుఁడు కొంత పరివారమును ప్రవేశింతురు]

వలీ.—అరే జల్దీ! జల్దీ! గట్టుకు ధపుడు! ఆపడవలకీ ఆపండి ఆపండి!

[అందఱు త్వరగా పరిక్రమింతురు.

సిపాయీలు.—[ఎక్కడివాఁడక్కడనుండి] ఓపడవ! ఓపడవ! వడవోయి పడవ, అరే కళాసుల్, ఓహోయిసరంగ్, ఈలాగారండి ఈలాగారండి, పడవల్ దరికి తెండి.

[అంతట పడవలు గడలతో నడుపుకొనుచు పాడుచు
పడవవాండ్రు ప్రవేశింతురు]

తండేలు.—[ముందుగడ వేయుచు]

గంగమ్మ తల్లికి శెంగల్వ పూదండ.
కాళింది కీ తెల్ల గల్వదండా,

---

రా. 1. కృత్యము. 2. అనుభవముచేత మాత్రమే. 3. ధైర్యములేమిని. 4. దుఃఖపడు. 5. తగినది. 6. శత్రువులకు స్వాధీనుఁడనై.

కళాసులు.—[వాని వెనుక గడ వేయుచు] గంగమ్మ ...

అందఱు.— జోర్సాయ్, బార్సాయ్, జోర్సాయ్, బార్సాయ్.

తండేలు.—గోదారి తల్లికి గొజ్జంగి పూదండ,

కళాసులు.— గోదారీ .... ...

సిపాయీలు.—పడవోయి పడవ, ఓయిసరంగ్, కళాసుల్, అరే వీగి చెవులూ లేవా? దరికీ రండి అంటే.

పడ.—[చూచి, గడలు నిలిపి] ఎందు కయ్యా!

జమాదార్.—మాకి దాటేండీ, కే విస్తాం.

తండేలు.—ఎక్కడైనా బల్లకట్లు సూసుకొని దాటండి, మేము నిలము.

[అని మగల గడలు వేయుచుండుగు.

అందఱు.— జొగ్గలదు ...

జమాదార్.— అరే మేము ఎంత కేవయినా యిస్తాం.

తండేలు.—ఏ మిస్తాగు?

జమాదార్.—మీా రడ్గండిరా.

తండేలు.—మీారు శెప్పండి.

జమాదార్.— నూరువరాలు యిస్తాం. మేము ఐదువందలగుంరిమి. అందర్ని వఖటే ఛణంలో దా టెయ్యాల.

తండేలు.—దండాయేంటి?

జమాదార్.—అవును. మరి మాట్లాడకండి, హార్కత్ కెయ్యకండి. నీా పున్నెం పండింది పొండిరా యీా వేళా.

తండేలు.—దాటేశినాక యీ గెయ్యరు గండా సాయబుమారాజులు?

జమాదార్.—యెర్రివాడా నీడబ్బ మేము యీ గేస్తాం? నీకీ యింకా యినాం యిస్తార్ సర్దార్. యిద్గో కేవు ముందే పుచ్చుకో.

[అని పంచి గలగల లాడించును, పడవవాండ్రు కలయఁ బలికి కొనుగుగు.

తండేలు.—[పడవలను దగ్గఱకు తెచ్చుట నభినయించి] ము టెక్కండి.

సిపా.—[ప్రవేశించి] రాజాకి దోనెకద్పులో పెట్టమని సర్దార్ హుకుం:

[ఆట్లే చేయుదురు. అందఱు తట్టక్కి కూర్చుందురు. వలీఖాన్ కొంత పరివారముతో మతియొక పడవ యెక్కును. సిపాయీలు సగ్గగొని కూర్చుండి కొందఱు పరుండి చుట్టలు గుడాకులు త్రాగు మందురు.

పడ.—[గడలు వేసి] ఏలెస్సా, ఓలెస్సా, ఏలెస్సా,
ఏలెస్సాబో వేలెస్సా ఏలెస్సాబో, వేలెస్సా. [మరల్ల మరల అడే.



సిపాయీలు.—అరె పడవవాళ్లు పాడండిరా పాడండి.



పడ.—యేలా యేలా యేలా యేలా యేలా యేలా యేలేలా,
యేలా యేలా యేలా యేలా యేలా యేలా దండేలా.

ఒక సిపాయి.—ఇందాక పాడ్తా వుండినారే అదే పాడండిరా.

తండేలు.—పాడతాం. ఇనాం యియ్యాలా సాయిబులు.

గంగమ్మ ...
కళాసులు.— గంగమ్మ ...
అందఱు... జోర్సెయ్ ...

జమా.—అరే, యింకొక పాటా పాడండి. యిదేమ్టి గంగమ్మ గుల్లమ్మా? పడుచుపిల్ల మీదా పాడండి వోయ్.

తండేలు.—అలాగే పాడతాం సాయిబులు. [కళాసులతో] యేది పాడదాంరా? పాడండి రా?

[తండేలు పాడినదానిని కళాసులు అనువదింతురు. సిపాయీలు కూడ 'జోర్సెయ్ బార్సెయ్' పలుకుదురు.

మల్లీ వొచ్చిందాక మర్లా మరవనంటా,
శేతూలో శెయ్యేశి శెప్పిలే శెంచు. జోర్సెయ్ ...
టూ టొండి పెడతాను, గుద్దుడికి పెడతాను,
కూడా తో దక వోవా జోడుగా మామా? జోర్సెయ్ ...
నీ మణుసు నా మణుసు నిరతూ దప్పా కుంటే,
యెడబాశి నెల వుంటే నే మోలే శెంచు? జోర్సెయ్ ...
ఏపూర నేపల్లె నేమి కన్నే శినవో?
యెంటా న న్రానీవు తుంటారి మామా. జోర్సెయ్ ...
కోకాజరీ తెస్తా, కొప్పూవిల్లా తెస్తా,
నవ్వూతా శల విచ్చి నన్నంపే శెంచు జోర్సెయ్ ...
కోకాజరీ వొద్దు, కొప్పూవిల్లా వొద్దు.
రావీవా నీతోటి శానీ వో మామా? జోర్సెయ్ ...

కెంపాము ద్దెట్టుకొని, చెల్లో బాయ్, యాడపట,
అల్లాడే సా రంగు, యెల్లిపో వెంచు, బోర్చెయ్ ...

సరంగు.—[చూడ్కి సారించి] సూద్రా! అల్లదుగో ఎంత ముసళ్లు!

తండేలు.—[చూడ్కి సారించి] ముసలి గాదు, సుత్తి కాపలా గుందిగా.

సరంగు.—కాదు మనిసిరా; బలే యాతిగాడ్రా.

తండేలు.—అవునురా. తెగబడ్డాడు. అలిశిపోయినాడు, సావుబదుకుల్లో వున్నాడు, సైగ శేస్తున్నాడు.

సరంగు.—ఆడుతనుకులాట్టంనూస్తే ముసల్ని తప్పించుకొంటూవస్తున్నాడ్రా.

తండేలు.—నారాయణా? నోవరో కాపనయ్యరా పాపం!

[నేపథ్యమున]

ఓరి పడవవాండ్రూ, ఓ సాయెబులూ, పుణ్యము కట్టుకొండి! చచ్చితిని! చచ్చితిని! మొసలి! మొసలి! మొసలి!

పడ.—యేమి సాయెబుగార్లూ, ఆయన్ని నక్కింతుమా? అయ్యవారో, అమాంతంగా ముసలి సంపేస్తది?

[అంతట విద్యానాథుఁడు ఈఁదుచు ప్రవేశించును]

విద్యా.—ఓరి పడవ వాండ్రూ ... మొసలి!

జమాదార్.—పోని పాపం! బతికించండి.

[పడవవాండ్రు త్రాడు వేయుదురు. విద్యానాథుఁడు దానిం బట్టుకొనును. పడవవాండ్రు చేఁదుకొనుచుందురు.

విద్యా.—[పడవ యెక్కి, వడవడ వడంకుచు, మహాభీతి నభినయించుచు, చీఁదుచు, తట్టంతయు, తడిచేయుచు, గుడ్డలు పిడుచుకొనుచు, తలతుడుచుకొనుచు,] ఓరపల్లెవాండ్రారా, మీధర్మాన బ్రతికితిని, ఆచంద్రార్కము మీ యిండ్లు పసిగొప్పఁగాక. సాయెబులారా, మీ దయవలన బ్రతికితిని. ఎంత మొసలి! ఎంత మొసలి!

(ప్ర.) సిపా.—[నోటినుండి చుట్ట తీయుచు యే] అయ్యా బొమ్మడ. నీవు నీళ్లలో బలే నాట్య మాడినావు!

విద్యా.—నాట్యమా? క్షణము తప్పిన ఈపాటికి మీ యెదుటఁ గాదు యముధర్మరాజు నెదుట నాట్యము చేయుచుందును, [అని కూర్చుండి సగుదుకొనును.

(ద్వి.) సిపా.—[నోటి నుండి చుట్టతివిసి] ఎందుకయ్యా కంతులూ, అంత సాహసం శేచినావు?

పడ.—మా దేశ్లకితం యేడుతూర్లు దాటి రియ్యారంలు గలిశిన సాస్తుల్లవా బాబూ నువ్వు?

విద్యా.—ఔనురా.

పడ.—నిన్ను సూశినాం బ్యామ్మడా మేము. దండ మెడతాం.

విద్యా.—నూరేండ్లు బ్రదుకుడు.

(ద్వి.) సిపా.—అయ్యా, నీకి యేలాకోలం చేసినవాళ్లకీ బుద్ధిలేదు. నీ తల్లికి నీవు మందిచ్చి బతికించకపోయినా, నీ తల్లిగుణం నీవు తీర్చుకొన్నావు పంతులుగారు.

(ప్ర.) (వేళాకోళము చేసిన, సిపాయి)—ఈపండ్యా దొరక్కపోతే యీపాటికి మీతల్లికి చావు అబద్ధం నీకి చావు నిబద్ధం అయి వుండిని లే.

విద్యా.—[ఆత్మగతము] పూర్వసువాసినీ, ఇంకను హేళనమేనా? [ప్రకాశము] సందేహ మేమి? మీ దయవలన బ్రతికితిని. [ఆత్మగతము] ఇక్కడ నందఱు మహామ్మదీయులే. విశేష మేమియు లేదు. దోసకదుపులో నేమున్నదో? [అని తట్టంత వడుపుచు, వడవడ వణఁకుచు] జ్వరము జ్వరము! అయ్యో! గోరుముద్దు మీఁద రోఁకటిపోటైనది! చలి! చలి! చలి! ఉహుహుహుహుహుహూ.

(ద్వి.) సిపా.—పండత్, ఇక్కడ తడి చెయ్యకు. లోపలిక్కి పో. అక్కడ హాయిగా బైటో, చలి వుండదు. ఇద్గో దారి.

విద్యా.—[లేచి] ఏది? ఊ, ఊ, ఊ, హుహుహుహు. [అని కని దిగి మగల పైకి లేచి] ఓయి నాయనో! అంతయు చీకటికోణమే!

పడ.—చణముంటె శీకటుండదులే సామీ.

స్థలము 8. దోసకదుపు

విద్యా.—అట్లైన సరియే.

[అని దిగి క్షణముండి కలయఁ జూచి, డబ్బిలోనుండి విభూతి తీసి, నలిపోయిన నట్లు విస్తారముగా ధరించి, పుస్తక మొకటి తడి తుడిచి చక్కఁజేసికొనును.

రాజు.—[విద్యానాథుం గాంచి, ఆత్మగతము] ఏమి! అగ్నిదేవునికరణి వెలుఁగుచున్నాఁ డీ బ్రాహ్మణుఁడు! ఈయనరాకవలన జనార్దనమంత్రి తురకలను గోదావరి దాఁట నీయక ఇచటనే హుళిక్కి గావించుటకై చేయుప్రయత్నము తెలిసినదిగదా, నా మంత్రులయందు దోషము లేదు. ఇది కేవలము దైవగతి. దీనికి ప్రతివిధానము యౌగంధరులే చేయవలయును. [సవిమర్శనము] ఈయనవలన నా వృత్తాంతము మంత్రులకు తెలియును.

విద్యా.—[పుస్తకము విప్పి రాగముగా]

*శ్లో. కతిపయదివసైః క్షయం ప్రయాయాత్
కనకగిరిః కృతవాసరావసానః,
ఇతి ముద ముపయాతి చక్రవాకీ,
వితరణశాలిని వీరరుద్రదేవే.

రాజు.—ఆహాహా! ఏమిశ్లోకము! ఏమి గ్రంథము శాస్త్రులవారూ అది?

విద్యా.—ఇందులో పిశాచము లేమయిన నున్నవా? [అంతటఁ గలయఁ జూచి] ఈమూల నింత వెలుతు రేమి? [అని రాజుం గాంచి] ఈదోసె కడుపులో నున్నగాఁ నేమి? అయ్యా మీరొక రున్నారా ఇక్కడ నాకుఁ దోడు?

రాజు.—ఆగ్రంథ మేమి?

విద్యా.—[ఆత్మగతము] ఎవ రితఁడు? బాల భాస్కరునివలె చీకటిం జీల్చుచున్నాఁడు! కాని. [ప్రకాశము] అయ్యా, ఈగ్రంథమా? ఇది అలంకార శాస్త్రము. ప్రతాపరుద్రమహారాజుమీఁద నేను కవనము చేసితిని.

రాజు.—వారిమీఁద నేల చేసితిరి?

విద్యా.—ఏమయినను సమ్మానము కలిగిన కొమారితను పెండ్లి చేసికొందమని.

రాజు.—సమ్మాన మేమయిన జరిగినదా?

విద్యా.—సమ్మానమే? దర్శనమే పూర్ణానుస్వారము.

రాజు.—అదేమి?

విద్యా.—రాజు నగరములో లేఁడు. నెలదినములు వేచియుంటిని, రాలేదు.

రాజు.—ఏమయినాఁడు?

విద్యా.—ఏమైనాఁడో? వేఁట కని కొందఱు, కాశి కని కొందఱు, తెలియదని కొందఱు, నోటి కొకమాట. అంతట ప్రాణము విసిగి, చాలు రాజాశ్రయ మని వచ్చినదారినే యింటికి మరలితిని.

రాజు.—పోనీ మఱియొకరైన దానినంకితము చేసి సత్కారము పొందరాదా?

విద్యా.—అయ్యా, అంత పుణ్యమా? అంతటను దానినే తగులబెట్టితిని.

* ప్రతాపరుద్రమహారాజుయొక్క యీవిని కని చక్రవాకి తనకు పగటిని అంత మొందించి ప్రియునితో ఎడఁబాపు కలిగించుచున్న బంగారుకొండ త్వరలోనే క్షయించునుగదా యని సంతోషపడుచున్నది.

రాజు.—[ఆత్మగతము] అహాహా! ఇట్టిమాట వినవలసిన యీదశలో నే యెట్లుండును! [ప్రకాశము] శాస్త్రులవారూ, దయ చేసి ఒకటి రెండు శ్లోకములు చదువుఁడు, విని యానందించెదను.

విద్యా.—అహా! రసజ్ఞులు వినుటకన్న మాకేమి కావలయును? వినుఁడు.

స్రగ్ధర

* శ్లో. దూరా దాకర్ణ్య విశ్వప్రసృమరమహసో వీరరుద్రస్య జైత్ర
ప్రస్థానారమ్భభేరీనినద మరినృపాః పూర్ణకర్ణజ్వరార్తాః
అరణ్యాద్రీన్ విశన్తో గహన మతిమహత్ కణ్టకాక్రాన్తకేశాః
త్రాయధ్వం ముఞ్చతేతి ప్రతినృపతిధియా పాదపాన్ ప్రార్థయన్తే.

రాజు.—ఆహాహా? ఆహాహా! అమృతమా? వచనమా గుడ?

విద్యా.—దీనిని వినుఁడు.

♦ శ్లో. ఉద్యద్దోస్స్తమ్భఖడ్గత్రుటదరిముకుటోపసంజాత రాహు
భ్రాన్తిభ్రశ్యత్పతఙ్గాభయకరణచణః ప్రాగనాసీరరేణుః.
అన్ధత్రిస్స్రోతసాభర్తు రాసీ దధికరణధురాభిన్న మత్తేభకుమ్భ
ప్రోద్యన్ముక్తౌఘతారానికరపరివృతాః స్వర్వధూవక్త్రచన్ద్రాః.

రాజు.—మీరు సాక్షాత్తు విద్యానాథులవారూ, స్వాములు, అగస్త్యులవలె నుప్పు గదా నమస్కరించుటకైన నాకు చేతులు లేవు. నా దుస్థితి నేఁటికిని నాకింకా యుంగర మున్నది. దానిం బుచ్చుకొని, కవి గానని దే మున్నది, ఉపయోగింపుఁడు.

---

* జగద్వ్యాపక తేజుఁడైన ప్రతాపరుద్రుని దిగ్విజయయాత్రా భేరీభాంకారము దూరమునుండి విని శత్రురాజులు కర్ణజ్వర పీడితులై కొండ కెక్కి—కాఱడవులం జొచ్చిరి ముండ్లకొమ్మలు జుట్టుపట్టి లాగఁగా ప్రతాపరుద్రుఁడే లాగుచున్నాఁడనుకొని 'మమ్ము రక్షింపుఁడు, వదలుఁడు' అని ఆ ముండ్ల చెట్లను వేఁడుకొనుదురు.

♦ ప్రతాపరుద్రుని కత్తిదెబ్బకు తెగి యెగసిన శత్రురాజుల కిరీటములం గాంచి రాహువు లనుకొని సూర్యుఁడు పలాయనమునకు ఉంకింప, సూర్యునికి ప్రతాపరుద్రుని సేనాధూళ్యంధకారము అభయ మిచ్చినది; ప్రతాపరుద్రుఁడు చీల్చిన యేనుఁగుల కుంభస్థలముల నుండి ఎగసిన ముత్తెము లనెడు నక్షత్రములు (యుద్ధము చూడను, యుద్ధవీరులను వరింపను, వచ్చిన) సురాంగనల మోముచంద్రుల చుట్టును ఒప్పారినవి.

విద్యా.— [పుచ్చుకొని, 'ప్రతాపరుద్రమహారాజు' అని పేరు చదువుకొని ఆశ్చర్యముతో] మహారాజా,

క. నాపేర నీవు వల్కృతి,
నీపేరే గంటి, దీని నీప్రేమను నే
నే పెట్టువాఁడ, ధర్మ
శ్రీపాలిత యోరుఁగంటిసింగపుఁబిరుదా.

[అని యుంగరమును మూటకట్టుకొనును.

రాజు.— [ఆత్మగతము] ఆహా! విద్యానాథుఁడా యీయన పేరు! మహాకవి. ఈయన ప్రతిజ్ఞ చాణక్యప్రతిజ్ఞయే యగును. ఈశ్వరుఁడు చేయూఁత యిచ్చినాఁడు.

విద్యా.— [పుస్తకము కట్టుకొనుచు మూటలోఁ బెట్టుకొనుచు ఆత్మగతము] ఏఱు దాఁట వచ్చి సాధనములు లేక వెనుకకు మరలువాఁడనై ఇచట నాకస్మికముగా గల్గిన మెఱుపు మెఱసినగతిం బలాయమానమగుటం గని కుతూహలితుండనై యటు నడచి, హిందూప్రభువును గురుతులు గొని స్పష్టముగా శకించి, ప్రవేశార్థము నాపన్నినయుపాయములు నాపలికినబొంటులను ఎట్లు ఫలించినవి! అహహో దైవములవు గలుగుచున్నది. దాని శ్రీపుఁగాఁ గనియు ప్రత్యక్షమైనది. మతి ప్రకృతము. [ప్రకాశము] ఇదిగో తరలితిని,

రాజు.— సాష్టాంగనమస్కారములు.

విద్యా.— అభ్యుదయోఽస్తు. [అని నిష్క్రమింతురు.

స్థలము 4. గోదావరి గట్టు

విద్యా.— [గట్టెక్కి, ఒడలు తుడుచుకొని, గుడ్డలు పిడుచుకొని చెట్టున ఆఱవేసికొని] ఎంతకీ ఈగాలికి తుణను. [నిక్క నలుగడం జూచి] ఎక్కడను తోఁగ పడదు. [నీటిపై పుఱ్ఱమగలి] ఇంత సేపు నీళ్లలోనే ఉన్నను, ఏమి దప్పి! [సవితర్కముగ] దప్పిగదా, చిత్తవికారమా, కార్యభారమా? [విభూతి దాల్చి] ఆహా! వస్త్రము లాఱినవి, ధరించెదను. [విప్పి పుచ్చుకొని ధరించి] అస్తమయము కానున్నది. చీకటి పడిన గడియదూరమే అయిడ యగును. [పరిక్రమించి, పడమటిదిక్కు చూచి] శివ శివా! దాఁటించిరి గదా తురకలు మహారాజును గోదావరిని, యమకింకరులు యాతనాప్రాణిని వైతరణిని దాఁటించునట్లు! హా! దైవమా! హా! దైవమా! ఎట్టి ప్రభువున కెట్టిగతి పెట్టితివి.

ఉ. కట్టఁడిదైవమా, యెటులు [1]కాటియ వెట్టితి రాజశేఖరుఁడా!
గుట్టినె కన్ను చెంపపయిఁ గొట్టినె తస్మహిమాతిరేకముల్?
[2]చెట్టలు లేరె నీ చెనఁటిచేష్టల కగ్గము సేయ? నిప్పరో!
దిట్టవు, మొండికట్టియవు, తిట్టులకే యొడిగట్టి చెప్పుదుఁడా! ౧౧

ఆ. ఖఁగకూన చెనకు నింక [1]విష్ణురథంబు,
శరభరాజు నణఁచు సాలెపురువు,
పార్థివేంద్ర, నిన్ను బందిఁ జేసెఁ బటాణి,
తరము గాని దొకటి ధరణిఁ గలదె! ౧౨

చ. పరముఁడు వేదపూరుషుఁడు పాదలిసోమకుచేతఁ జిక్కఁడే!
హరిహరపద్మభూమయుఁ డహస్కరుఁ డాఁగఁడెవింధ్యుఁబాఁపఁగా?
ధరఁగలరుద్రదేవతవు దక్కితి వీవు కటా పటాణికిన్!
[1]దరళవిధిప్రతారణలు దప్పునె మేదిని నెట్టివారికిన్! ౧౩

ఉ. ప్రౌఢకళాసులున్, దెలివిప్రౌ వగుమాలిమి, మార్తురన్ యమ
[1]క్రోడము సేర్చుబంట్లు, [2]తెరకోకలు, గ్రాలఁగ బీల నేఁగుచున్,
ఓడ విరుద్ధవాయుహతి నుత్తర [3]వార్నిధిఁ జొచ్చి వ్రేల్మిడిన్
బూడెనుటో [4]శిలాహిమసమూహమునన్! విధి యెంతధూర్తమో. ౧౪

---

౧౧. 1. బాధ. 2. దుర్మార్గులు. అగ్గము=పాలు,

౧౨, 1, గరుత్మంతుని. శరభము=ఎనిమిది కాళ్లజంతువు, సింహమును కొట్టునది,

౧౩. పాడుసోమకుఁడు వేదమును దొంగిలించినాఁడు, త్రిమూర్త్యాత్మకుని సూర్యుని వింధ్యపర్వతము ఆఁపివైచినది...1 చపలమయిన దైవముయొక్క వంచనలు.

౧౪. 1. జొమ్మున. 2. తెరచాఁపలు. 3. సముద్రము. 4. రాతిమంచు మొత్తములో. సేనానాయకులు, దండు, మహామంత్రి, విజయధ్వజములు, గోనగు నంగములు బలిష్ఠముగాఁగలిగియు, ప్రతాపరుద్రుఁడు దుష్టదైవప్రేరణచే వేఁటకై గోదావరీతీరారణ్యమున కేఁగి కఠినాత్ములైన తురకలరాణువలో చిక్కఁబడెను,... అనిప్రస్తుతము.

[మరల నలుదెసల చూచి నిగిడించి] ఎక్కడను మనుష్యప్రాణి యగపడదు. [మఱియొక దెసఁ గని] ఆహా! ఏమి యిది, అడవి మొగాళమున అందఱు జనులు! దండు; తురకలుగారు, వేఁట సిబ్బంది. అయ్యో! రాజపరివారము! రాజును వెదకుచున్నారు. ఆహా! యిందాఁకటిగుఱ్ఱము ముందు దుముకుచున్నది. ఆ దండును రాజు దోనియం బడినచోటికిఁ దెచ్చుచున్నది. అక్కటా! రెండు గడియలకు ముందు ఈ దండు వచ్చియుండరాదా! ఏమి హతవిధివిలసితము! ఏమి యీ గుఱ్ఱము విశ్వాసము! కాలకూటము హరుని కంఠమున, ఔర్వానలము సముద్రుని కడుపున, ప్రతాపరుద్ర మహారాజుకార్యము నా హృదయమున, తిర్యగ్జంతు వింత యుపకరించినదఁట, మహాకవి నఁట, ఎంత యుపకరింపరాదు! బార్హస్పత్యౌశనస చాణక్య తంత్రాధ్యయనము పందలకడ సందడింపనా! ప్రతిభకు ఏయల్లిక కష్టము? కావ్యధోరణిని కార్యధోరణిం జేసెద. ఈ దండుం గలయుదునా? వలదు. ఈ మూఁకనోట నువ్వుగింజ నానదు. ఇక్లేపోయి యేదేనొక గ్రామముచేరి కార్యప్రబంధము నిబంధించెదఁగాక. అమ్మాయి పెండ్లికేమి తొందర? కార్యధురంధరునకు నాకు ఇఁక యోగకాలము. అమ్మాయి పుట్టకమునుపే ఈ కృతిని సంకల్పించితిని. కావున ఈ కృతియే నా పెద్దకొమారిత. దీనిని ఓరుగంగోలు సింహాసన వివాహపీఠమున రాజునకు పెండ్లిచేసి పిమ్మట పురందరగురు విభవముతో చిన్నమ్మాయికి పెండ్లి గావించెదను. [గోదావరి యుత్తరతటముదెస దృష్టి సారించి] రాజప్పుడే తన రాష్ట్రముం బాసెఁ గావలయు. ఉజ్జృంభితమైన తదీయహృదయాంధకారమా లోకమెల్ల నాక్రమించుచున్నది! [నలుదెసలం గని] అహహా! ఎటు గన్నను లోకము రాజునకై వగలఁ బొగులుచున్నది.

ఉ. దండితవైరివీరునిఁ బ్రతాపనరేంద్రుని ముల్లెమూటగాఁ
గొం డని దైవ మీతురకకూళల కీఁ గనుఁగొన్నమింటికిన్
గుండియ వ్రీల నెత్తురుల గుజ్జగుకండలు రెండునుం బలే
చండగభస్తిమండలము, శైవలినీకలితార్కబింబమున్! ౧౩

---

౧౩. శత్రువీరులను దండించిన ప్రతాపరుద్రమహారాజును ధనపు మూటగా 'ఇదిగో పుచ్చుకొండి' అని దైవము క్రూరులగు నీ తురకలకు ఇయ్యఁగాఁ జూచిన యాకాశమునకు గుండె పగులఁగా వెల్వడిన నెత్తుటిగుజ్జతోడి రెండు బ్రద్దలుసుమా ఆకాశమందలి (యీ సాయంకాలపు) సూర్యబింబమును గోదావరిలోని (యీ) తత్ప్రతిబింబమును.

ఓ గోదావరీ,

ఉ. వేసర కేడ్చెదేల, యరవిందసఖప్రతిమారుణాస్యముగా
మూసికొనంగ శైవలపుమూర్ధజముల్, గడు గాలి నూర్చుచుగా,
భాసురవీచికాత్రివళి పై వయిఁ దోఁప రథాంగయుక్ స్తనో
చ్ఛ్వాసముమీఱ, మాధుకరఝంకృతిమూల్గున, నంచ యెల్గునన్? ౧౬

తే. అహితవిధి కిట్లు రోషారుణాత్ముఁ డగుచుఁ,
గుతలపతిపాటునకుఁ [1]గార, క్రుంకుమెట్టఁ
జరమ కాష్ఠా చిత సమిద్ధ సాంధ్యరాగ
వహ్నికుండానఁ బడె [2]లోకబాంధవుండు. ౧౭

క. కువకువ [1]వాపోవఁ [2]దరుల్,
నవనవ [3]బాష్పాంబువృష్టిఁ [4]జదలుం గురియుగా,
[5]శివలవిరుతి నేడ్చు దిశల్,
[6]భావసి నవసి పేదపడియె భువినెమ్మొగముగా. ౧౮

౧౬. సూర్య ప్రతిబింబ మనెడు కందిన ముఖమును నాఁచనెడు తల వెండ్రుకలు క్రమ్ముకొనఁగా, (ఈ సాయంకాలపు) గాలియను మిష చేత నిట్టూర్పులు నిగుడ్చుచు, ప్రకాశమానములయిన యలలనెడు వళిత్రయము మాటిమాటికి పైని పయి అగపడుచుండఁగా జక్కవదంపతులనెడి పాలిండ్లయందు బుసకొట్టుచు చుండఁగా తుమ్మెదల ఝంకారమనెడు మూలుగుతోను హంసకూఁతలనెడు, కంఠ ధ్వనితోను విసువక ఏల యేడ్చెదవు?

౧౭. కుతలపతి=రాజుయొక్క. 1. ఓపక. 2. సూర్యుఁడు, చర... మిద్ధ—చరమ = కడపటి_కాష్ఠా = దిక్కునందు, చిత = పేర్పఁబడిన (కాష్ఠ = కట్టెలతో_ఆచిత = పేర్పఁబడిన) సమిద్ధ = మండిన_సాం... డానన్ = సంజకెంజాయ యనెడు నిప్పుల గుండములో,

౧౮. 1. ఏడ్చుచును. 2. చెట్లు. 3. కన్నీటివర్షములు. 4. ఆకాశము, 5. నక్కల యూళలచే. 6. భూమియొక్క యందంపుమోము పొగలు గ్రమ్ముకొని కళదప్పినది. పక్షులు చెట్లలో చేరి కూయుట, సంజమంచు పడుట, నక్కలు అఱచుట, రాత్రి వంటలకై నిప్పు రాజవేసికొనెడు పొగలు వ్యాపించుచుండుట, చీకట్లు పడుటయు, ఇట్లు వర్ణింపఁబడినవి.

ఆ. [1]జ్యోత్స్న గలుగ వెలిఁగి జ్యోత్స్న వీడి చనంగ
విన్ననైనపూర్ణ [2]విధునివగిది,
సిరి గలుగ వెలింగి సిరి వాయ క్షణములోఁ
దేజ మెడలె రుద్రదేవుముఖము. ౧౯

క. కత చేయుట, కత చెప్పుట,
కత వ్రాయుట, కతను నాటకం బాడుటయుఁగా,
గత నెఱుఁగుటయును, వేఱే;
కతయ యగుట వేఱె; దైవగతి వింత గదా! ౨౦

క. కతగా నేనియు నీభూ
పతిగతి యాలింప గుండె పట్టున ప్రీలుఁగా,
వెతపడ మితియె కంటఁ గనఁగా?
మతి నాడఁగ భ్రమియు జడియు మలుచుం బలుపుఁగా. ౨౧

క. తబ్బిబ్బయినం బని చెడు;
నబ్బురపా పైన నీతి యందదుకు లగుఁగా;
మబ్బు తొలఁగించుకొని యిదె
గబ్బితనము దాల్చి రాజకార్య మరపెదఁగా. ౨౨

అహో! నాహృదయము [1] జగన్మిథ్యాత్వ రాద్ధాంత నిశాంతం బగుటయే నిట్టి పాపావిర్భావంబునకు నెలవుగా భాజనం బైనది. దీనిం గాంచినను క్షణములో దిగులు క్షణములో తగవును గలుగుచున్నవి. అరాజకత్వమా? మంచిది; [2] విషాదము [3] స్త్రైణము, [4] వ్యవసాయము [5] పౌరుషము. అనభ్యస్త రాజకార్యుండను ఎట్లు కార్యధోరణిం బాటింతును! [ఇంచుక ఆలోచించి] ఇట్లగుంగాక.— ఈ కోణితివాడ కరిగి కరణప్రభృతి రాజకీయుల నిడిత్రిప్పి కేవు మధ్యాహ్నము మంత్రిసన్నిధ ముండెద. కరణమునింట అతని గ్రామాధికరణక ప్రభృతులం జేరం బంపి వేసి, అతండు వారిందోడ్కొని వచ్చునంతలో రాజదత్తములుగా శ్రీప్రతాపరుద్రమహారాజ నియుక్త త్రిలింగరాష్ట్ర సర్వధర్మ విచారణాధ్యక్షుం డని యధికారమును

౧౯. 1. వెన్నెల. 2. చంద్రునివలె.

1 ప్రపంచము అసత్య మనెడు సిద్ధాంతమునకు చోటు. 2 దుఃఖించుట. 3 స్త్రీలది. 4 ప్రయత్నించుట. 5 పురుషులది.

నిర్దేశించుశాసన మొకటి, సర్వ గ్రామములను మంత్రిసమానముగా సన్నాహములు జరిపి ఏలినవారి ముడుపులో వ్యయము వ్రాసికొనవలసినదిగా గ్రామాధికారులకు రాజశాసన మొకటియు, వ్రాసి, కాలముల్లు గ్రుచ్చుకొన్న దని తీడిగించ చెప్పించి, రెంటికిని రాజముద్రికలు వేసి యుంచుకొని, గ్రామాధికారులకు పంపెదను. సన్నాహశాసనమునకు నిరువది ప్రతులు వ్రాయించెద. అందులో నే ప్రతిగ్రామస్థ కరణముఁడును తనశాసనము తాను పుచ్చుకొని కడమవానిని పైగ్రామాధికారుల నికి తత్క్షణమే పరుగుటపా మీఁద పంపునట్లు వ్రాయించెద. అన్నిటికిని ఇతరులను కను మొఱఁగి రాజముద్రికయే వేసెద. ఈ ప్రయోగముచే గ్రామగ్రామంబునను సవారి, పదునార్గురు బోయలు, వెంటరా బంట్రౌతులు, జోడు దివ్వటీగ్రాంగ్రము, వీరినెల్ల నేను చేరకముందే పుట్టించియుంచెద. అహాహా! రాజముద్రికాప్రభావము! ఈ కరణముపేరు కోణకంచి బుచ్చన్నయఁట. ఈ నియోగి కనులకు మొలఁకువగా గంత వేయవలయును. అవులించినఁ బ్రేవు లెన్నజాతి గుంది. శాశ్వతమునకు మెచ్చి రాజిచ్చిన యీ యధికారమును చెల్లింపకముందుగా అద్దరిని తల్లిం గనఁ గోరి వినీతవేషాభిలాషినై నిష్పరివారముగా వచ్చి, ఏఱుదాఁట సాధనములు లేక, మరలితి నని బొంకి కరణమును సమాధాన పెట్టెదను.

క. కుదిరెఁ బదక మిప్పటికిఁగా,
బదిలముగా మంత్రి తెలుకపడు రేపటికిఁగా;
పదమదము గలదు పిమ్మట;
మది కరఁగదొ యింక నైన మలఁకల విధికిఁగా? ౨౨

గట్టు దిగి ఆ యూరిదారి వెదకెద. [అని నిష్క్రమించును.



# చతుర్థాంకము

స్థలము :— ఓరుగల్లు, యుగంధరమంత్రిమహాలి, కచ్చేరిశాల.

[అంతట యుగంధర జనార్దనులు ప్రవేశింతురు]

యుగం.— శభాసు జనార్దనా, నీ జాగ్రత్తకు సంతోషమే, కాని,

ఉ. ఏల చొరంగనిచ్చితివొ యాతురకన్ మనసీమలోనికిన్?
చిలువ వేమి యి ట్లగడు సేసినవీని నెఱింగినప్పుడే?
ఏల పటాణినేతలకు నీసులు వెట్టి పరస్పరంబు ఖూ
నీ లొనరింపఁ జేయవు? మనీషివి, నీతలఁ పేమి బాలకా? ౧

జనా.— వారియందు సప్రయత్నుఁడను గానే యున్నాను.

యుగం.— చెనసముకి దొరకినాఁడా యేమి!

జనా.— అవును.

ప్రతీహారి.— [ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి, సేనాపతి బేతాళరావుగారు వచ్చియున్నారు.

యుగం.— రమ్మను.

ప్రతీ.— మహామంత్రిగారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

యుగం.— [చింతించుచు ఆత్మగతము] పోయిన తురకదండు రాలేదు, పోయిన ప్రభువు రాలేదు. ఆదం దేమయిన ప్రభువును పట్టుకొనిపోయియుండునా? [వామాక్షిస్పందనము సూచించి] అక్కటా! వామాక్షి పట్టుబడె ననుచున్నది!

[అంతట బేతాళరావు ప్రవేశించును]

బేతా.— జయము జయము మహామంత్రిగారికి.

యుగం.— బేతాళరావూ, కూర్చుండుము. నీ జాగ్రత్తకు మిగుల సంతోషము. తమ్ముఁడు నీపనిని సులభపఱుచుచున్నాఁడు.

బేతా.— దేవరవారు పెట్టినంతపనికే మిక్కిలి కృతజ్ఞుఁడ నయ్యెదను.

యుగం.— మానీతికి శోభించినది నీది, నీచేతికి శోభించినది మాది.

బేతా.— తమ రట్లు చెప్పుటయే. తమరు రాఁగానే మాశేమియు శోభింప దని నిరాశచేసికొంటిని.

యుగం.— న్యాయ్యమే.

క. మౌనులకుఁ దపము లెట్లో
భూనాథుల కట్లె సైన్యములు, కరణీయం
బైనవి, వ్యయ మొనరింపక
గానివి, మఱి తీఱనికోఱికలుఁ దక్కఁగ. ౨

అయినను ఈమాఱు మాయాజ్ఞ కాఁగానే నీదండు అనుమకొండదండు గెలువ ప్రక్కలం బోదివి, యీ తురకదండును రూపు మాపవలసినది.

చేతా.— మహాప్రసాదము.

ప్రతీ.— [ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి. శిరస్తా విశ్వాసరావుగారు, సురపురం జమీన్దార్ విజయరామస్వామిగారు, గోష్ఠీసముద్రం జమీన్దార్ నారాయణరాజుగారు, చెరుముకిశాస్త్రి, ఇంక ననేకమంది జమీన్దారులు, ఉద్యోగస్థులును, వచ్చియున్నారు; అందరు దర్శనానికి మామూలుగా శెలవు గలవారే.

యుగం.— అందఱను రమ్మను.

అందఱు:— [వచ్చి] జయము జయము మహామంత్రిగారికి.

యుగం.— కూర్చుండుఁడు. [వచ్చినవారు కూర్చుందురు.

యుగం.— మీరందఱు సప్రయత్నులే. నేను వచ్చి విశేష మేమి?

జమీన్దారులు.— తమరాక రాజ్యాంగముల భయసన్నిపాతమునకు ఔషధమైనది.

చేతా. విశ్వా.— తమరాక వాడినచేనికి వర్షమైనది.

యుగం.— [ఆత్మగతము] మఱి ప్రభువుస్థితి?

ప్రతీ.— [ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

[అని చేతికి చీటి యిచ్చును.

యుగం.— [ఆత్మగతము] ప్రభువుస్థితి జయమఁట. వామాక్షి స్ఫురణగ నన్నది. ఇందు నా ప్రయత్నమువలయునా? [దక్షిణ బాహుస్ఫురణమును సూచించి] అహో! సర్వము నాప్రయత్నముననే సాధనీయ మని దక్షిణబాహు వుచ్చరించుచున్నది! [చీటి పుచ్చుకొని చదివి ఆత్మగతము] "మంత్రిమహోదయుఁడను, కార్యము చెడినది, తక్షణము దర్శన మీయవలయును," అని చీటి. విద్యానాథమహాకవి అని

చేరాలు. బళి! ఇతఁడెవరో పరమనిపుణుఁడు, రాజుస్థితిని ఎఱిఁగి వచ్చినాఁడు, కార్యము చెడినదా? నా యూహ తప్పలేదు. [ప్రకాశము] ధర్మసింగ్ ఆయనను తోడ్కొనిరా.

ప్రతీ.—[విద్యానాథునిం దోడ్కొని వచ్చి] వారుగో మహామంత్రిగారు.

యుగం.—[విద్యానాథుని పరికించి స్వగతము] మంచి వర్చస్వి, మహాకవి, మంత్రరత్నకుఁడు, ప్రయోగభంగము చేయుఁడు. [ప్రకాశము] ఇక్కడ ఇక్కడ. [అని దగ్గఱకు పిలిచి] ఎవరురా అక్కడ? కుర్చీకుర్చీ!

[నౌకరు కుర్చీ తెచ్చి యుగంధరునిప్రక్క నుంచును.

యుగం.—[విద్యానాథుని నిదానించి చూచి లేచి] విద్యానాథ మహాకవి యనఁగా నవరో అనుకొంటిని. నా ప్రాణమే. [అని కౌఁగలించుకొనును.

విద్యా.—[కౌఁగలింతలోనే చెవిలో] రాజును తురక ఢిల్లీకికొనిపోయినాఁడు.

యుగం.—ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు! [అని మరల కౌఁగిలించుకొని చెవిలో] వేఁటగాయములతో రాజు బెడఁదపూడిలో రామావధానులయింట నున్నట్లు జాబు తెప్పింపుము.

విద్యా.—[కౌఁగిలింతలోనే చెవిలో] చిత్తము.

యుగం.—కూర్చుండు తమ్ముఁడు కూర్చుండు.

[విద్యానాథుఁడు కూర్చుండును.

యుగం.—జనార్దనా, ఎవరో ఎఱుఁగుదువా?

జనా.—[సాష్టాంగప్రణామములతో] అహా చిన్నన్నయ్య!

[అని లేచి వచ్చి పాదముల వ్రాలును. విద్యానాథుఁడు, లేచి కౌఁగిలించును. జనార్దనుఁడు కూర్చుండును.

యుగం.—ఇరువదియేండ్లకా అన్న జ్ఞప్తికి వచ్చుట?

విద్యా.—ఖ్యాతి సంపాదించుకొనిగదా సన్నిధి నుండవలయును?

యుగం.—తమ్ముఁడు తిరుగ వేయని శాశపత్త్రము సాక్షరము ఇఁక లేదుగదా?

విద్యా.—అంతయు తను యాశీఃప్రభావము, తమకు సెల పట్టిన విద్య నాకు సంవత్సరము పట్టినది.

యుగం.—పదేండ్లు నీ వార్తయే తెలియక అమ్మ పడినదుఃఖము చెప్పలేము. నీవు కటకములో ప్రభాకరవ్యాఖ్యలతో తోడాలు లాగుకొన్నప్పుడు గదా మాకు నీవార్త తెలియుట?

విద్యా.—ఏమో బాల్యచాపలము.

యుగం.—ఇప్పుడు ముసలివైతివి గాఁబోలుఁ? నీ ప్రథమోపాధ్యాయుఁడు ఘనపండా దిగ్విజయజ్యోతిషికులు క్షేమమా?

విద్యా.—క్షేమముగా నున్నారు. దర్శనము చేసికొని వచ్చితిని.

యుగం.—ఆ తోడాలు చేతుల నున్నవా? [అని చేయి పట్టుకొనఁ బోవును.

విద్యా.—ప్రయాణములో తీసిపెట్టి వచ్చితిని.

యుగం.—పదునెనిమి దేండ్లకు పదునెనిమిది విద్యలు ముగించి, గండేండ్లు దేశాటన రాజసభాప్రవేశములు గావించి యిప్పుడు అన్నకడకు వచ్చితివి. [జనార్దనునితో] తమ్ముఁడూ మీ చిన్నన్నయ్యను అమ్మకు చూపింపుము.

ఆ. అమ్మ నేఁడు ముడుపు లంపుఁ బో చెటి లక్ష
విశ్వనాథునకు వేంకటాద్రి
నాయకునకు రంగనాయకునకు రామ
నాథునకును సోమనాథునకును.

చిన్నన్నయ్యకు భోజనాదికము విచారించుకో, మరల పాతిపోనీకుండ సేవించుకో భోజనము కానిచ్చి తీసికొనిరా, జ్యోతిషవినోదము కొంచెము చూడవచ్చును.

[జనార్దన విద్యానాథులు నిష్క్రమింతురు.

యుగం.—[సభ్యులతో] ఇతఁడు మా పినతల్లి కుమారుఁడు.

క. ఈతని జన్నవితోడఁ
మాతల్లియె పెంచెఁ గవలమాడ్కిఁ; మహా వి
ఖ్యాతి గలజోస్యుఁ; డీతని
చేత మనము దెలియవచ్చు క్షితిపతివిధముల్.

సభ్యులు.—తమదర్శనమైన పిమ్మట దారి యేర్పడక తప్పునా! ఇఁక మేము గోలీలు బొంగరములు ఆడుచుండవచ్చును.

యుగం.—ఏమి చెకుముకిశాస్త్రీ, వీరాంజనేయ మేమి చేసినది?

చెకు.—తోఁక జాడించి కన్నులలో మన్ను కొట్టుచున్నది.

యుగం.—ఎంతసేపు కావలయు మన్ను కొట్టుటకు?

చెకు.—గరుత్మంతుని దృష్టి గద్దలకుఁ గలుగునా?

[విద్యానాథ జనార్దనులు వచ్చి కూర్చుందురు. పేరిగాఁడును వచ్చి యుగంధరునికి విసనకఱ్ఱతో విసరుచుండును.

యుగం.—విద్యానాథా, కొంచెము వీరికి జ్యోతిషవినోద మొసంగుదువా?

విద్యా.—తమయాజ్ఞ. [బేతాళరావును జూచి] మీచేయి చూపుఁడు.

[బేతాళరావు చూపును.

యుగం.—మీరు కానిచ్చుచుండుఁడు. [అని వ్రాయుట నభినయించును.

విద్యా.—మాది ఓఢ్రజ్యోతిషము. మాకుచేయి చాలు, జాతక మానావశ్యకము. వేయేండ్ల క్రిందటివారిదైనను సరియే, సరిగా చేతితస్వీరు తీసియుంచిన వారి దినచర్య యావత్తు చెప్పఁగలము. మీకిప్పుడు సూర్యునిలో అంగారకుఁడు మీ నామధేయము?

బేతా.—బే [అని సగములో]

విద్యా.—మీరు చెప్పకుఁడు, బేతాళరాజా.

సభ్యులు.—ఏమాశ్చర్యము! ఏమాశ్చర్యము!

విద్యా.—యుద్ధము, జయము, జేపు.

బేతా.—సంతోషము. గతము చెప్పుఁడు తార్కాణగా.

విద్యా.—[చెవిలో] మీరు అయిదేండ్ల క్రిందట విజయనగరము నుండి దండుతో వచ్చుచు తుంగభద్రకడ విడిసి గట్టుమీఁద ఒంటిగా సికారిపోయి నప్పుడు గొల్లపడుచుచే చీవాట్లుపడిన చరిత్రము చెప్పుదునా?

బేతా.—స్వామీ, ఈయన యెవరో దేవుఁడుకాని మనుష్యుఁడుగాడు. ఇది దివ్యదృష్టిగాని జ్యోస్యముగాదు. స్వామీ, ఇఁక నాకు చాలును.

విశ్వా.—ఆహా అంతటి వాక్సిద్ధియేని నాజాతకము కొంచెము చెప్పుఁడు.

[అని చేయి చూపును. పేరిగాఁడు తెలుఁగుదినవోరు మూయక ఆశ్చర్యపడుచు పరికించుచుండును.

విద్యా.—[విశ్వాసరావుచేయి చూచి] పంతులకు గురువు ఉచ్చ. వాక్స్థానమున; మహాయోగజాతకము; మహావాగ్మి.

బేతా. ప్రభృతి సభ్యులు.—బళిబళి, ఏమి విశ్వాసరావుగారు? అనుభవసిద్ధమా? ఇప్పుడైన మామాట ఒప్పుకొందురా?  [విశ్వాసరావు నవ్వును.

విద్యా.—బహుసమగ్గఁడీయన. గుండెలు తీసిన బంటు. ముగ్గురు కొమారులు. పెద్దవాని జాతకమున మీనలగ్నములో గురువు. వాఁడును ఇంతటినోఁటివాఁడే. భార్య మహాపతివ్రత. పంతులకు కూడ ఏమయిన తార్కాణ గావలయునా?

విశ్వా.—చెప్పుఁడు.

విద్యా.—[చెవిలో] పంతులూ, నీవు మూఁడేండ్లక్రిందట సురపురము జమీనును కాపాడుటకై మా యన్నగారి చేవ్రాలు చేసి పెద్దసెట్టికడనుండి యనుబది లక్షల వరహాలు తెప్పించి సర్కారు ఖజానాకు చెల్లించి మూఁడవనాఁడు మరల మాయన్నగారే పంపినట్లు ఆతనికి పంపలేదా?

విశ్వా.—[తటాలున కుర్చీనుండి దుమికి విద్యానాథుని పాదములు పట్టుకొని] మహానుభావా, నాగుట్టు దాఁచి నా తల కాచెద నని వర మిచ్చిన ఈ పాదములు వదలెదను. [పేరిగాఁడు ఆశ్చర్యముతో తెఱచిననోరుమూయక చూచుచుండును.

విద్యా.—వర మిచ్చితిని పో.

విశ్వా.—[తన కుర్చీలో కూర్చుండి ఆత్మగతము] ఇతని గోప్యము ప్రాణోపద్రవముగానున్నదే! పోయెడుభూత మీ చెట్టుకొమ్మను విఱుచుకొని పోవును గాక. [ప్రకాశము] సర్వజ్ఞమూర్తీ, బ్రహ్మవాక్కయినను తప్పునుగాని మీ వాక్కు తప్పదు. పోనీ నేనధికప్రసంగి నని తమరు ముందే సెలవిచ్చినారుగదా. వీని చేయి చూడుఁడు.

[అని పేరిగానిని చూపును.

పేరి.—[వణఁకుచు తబ్బిబ్బుగా వచ్చి] యిదుగో సూసుకోండి నే నే మెరగను.

[అని రెండుచేతులు బోరగించి చూపును.

విద్యా.—[ఆత్మగతము] ఈ మహానుభావుఁడే మీ కేదో [illegible] చున్నాఁడు. [ప్రకాశము] వీఁడు చాకలి, పేరు పేరిగాఁడు; వీని పెండ్లాము ఎల్లి.

పేరి.—[భయముతో వడఁకుచు వెనుకకుఁ బోయి తనకావున నిలిచి] మహాప్రభో, నాను సత్తెప్రమానకంగా శెప్తా. నాను తీశేదుండి. అదీ తీశేదుండి.

జనా.—ఏమిరా నీవును అదియు తీయలేదు?

పేరి.—వుంగరం మారాజా?

జనా.—ఏయుంగరమురా?

పేరి.—[విద్యానాథుని చూపుచు] ఆమారాజా పోంగొట్టుకున్నా వుంగరమండి.

జనా.—నీవు తీయకపోయిన, ఆయన యుంగరము పోఁగొట్టుకొనెనని నీ కెట్లు తెలిసినది?

పేరి.—ఆరికేతులోది తందేమో అని, యీరికేతులోది తందేమో అని, ఒకరొకరి సెయ్యి సూడటం, [విశ్వాసరావును చూపుచు] యీ మారాజా ఆయన కాళ్లట్టుకొని 'నాగుట్టు దాసండి నాతల కాసండి' అని, సామీ దట్టి నన్ను సూపటం, యిదంతా నాను సూళ్లేదండీ?

బేతా. జమీన్దార్లు.—[నవ్వుచు] ఏమయ్యా ఉంగరము చోరీ చేసి, పాపము! లోఁకువ యని వానిమీఁద పెట్టుట న్యాయ్యమా?

విశ్వా.—నే నఁటరా నీమీఁద పెట్టినాఁడను?

పేరి.—రచ్చించుండి మారాజా, నా నెరగనుండి. [అని వంగి దండాలు పెట్టును.

జనా.—ఓరి మూర్ఖుఁడా, ఉంగరము గాఁనురా, జోస్యము చెప్పుచున్నారురా, చేయి చూచి.

పేరి.—తెలక కూశినా, నన్ను కాయండి మహాప్పభో.

విశ్వా.—ఈమాఱు మన్నించితిమి. ఇంకొకమాఱు ఇట్టి తప్పుచేయుము. తెలియును.

జనా.—మన్నించినారులే. భయపడకు, చేయి చూపించుకొనెదవా?

పేరి.—పెబువుల మణుచు, [అని యెడముచేయి చూపును.

విద్యా.—కుడిచేయి చూపరా.

పేరి.—యేశగ్యిత్తే యామని ప్పట్టి శెయ్య సూపినాను సామీ. తెలవోగ్గి.
[అని కుడిచేయి బోరగించి చూపును.

విద్యా.—అఱచేయి చూపరా? [పేరిగాఁడు అఱచేయి చూపును.

విద్యా.—[చూచి] ఈ నడుమ వీఁడు ఎవ్వితో జగడమాడినాఁడు. అంతట అది [అనఁగానే సగములో]

పేరి.—[వంగి దండ మిడుచు] అది శెప్పకండి సామే, అది శెప్పకండి. నాను శిత్తగించుకొన్నమాట పెబువులు మనవి శేసుకోండి.

జనా.—మీకు జగడమేల వచ్చినదిరా?

పేరి.—నానుండి దాన్ని 'మామా' అని పిలుచున్నానండి, 'నాను పిల్ను' అన్నదుండి.

విశ్వా.—మరేమని పిలిచినదిరా?

పేరి.—పేరిగా పేరిగా పేరిగా, అని పిలిశిందుండి. ఇదేనుండి నాను శెప్పద్దని శిత్తగించుకొన్నదుండి.

విద్యా.—దీని శేనంతమాత్రము చెప్పను.

విశ్వా.—దానిచేత అలాగు పిలిపించుకొని ఊరకున్నావా? నీవు అన్నములో ఉప్పువేసికొనుట లేదఁటరా?

పేరి.—[సగర్వము] నానుండి, అపాట్నా, [సవ్రీడము] ఒక్కాని మాట అన్నానండి.

విశ్వా.—నీమాట పడి ఊరకున్నదిరా అది?

పేరి.—అదుండి ఆపాట్కా మైలగుడ్డలమూ పెత్తి నా నెత్తినిమోదేశిందుండి.

జనా.—జోస్యులవారు, ఇది కూడ వాఁడు చెప్పకలడని చిత్తగించు కొన్నదే. చక్కఁగా మనవిచేసికొండి.

పేరి.—ఇది శెప్పొద్దని నాను మరీ అగిత్తెంగా శిత్తగించుకొన్నానుండి.

విద్యా.—ఓరీ, ఇందుకోసము ఎల్లిమీఁద నీకు కోఁపమా?

పేరి.—కోపం లేదుండి. ఒకపాలి గశిరినా ఒకపాలి మంచిమాటాడుద్దుండి.

విశ్వా.—వాఁడు వలదని చిత్తగించుకొన్నది మాని కడమ యేమియునుఁ జెప్పఁడు, పాపము!

పేరి.—అవును మహాప్పబో.

విద్యా.—[చేయి నిదానించి చూచి] అయ్యో! [అని వానిముఖముం గనుచు] పాపము! ఏమి గ్రహచారమురా! ఇఁక నిప్పుడు చెప్పఁగూడదుపో.

[పేరిగాఁడు దూరముగా పోయి దిగులు పడుచు గుటకలు మ్రింగుచుండును.

విశ్వా.—[జనాంతికము] ఏమి విశేషము?

విద్యా.—[జనాంతిక మభినయించి పేరిగానికి వినంబడునట్లుగా నే] వీనికి రేపు ఈవేళకు మరణగండమున్నది. తప్పనేని ఖయిదు. విడిచిపెట్టుఁడు వాని సంగతి, రసము లేదు.

యుగం.—[వ్రాఁత ముగించి] విద్యానాథా, ఒకనాఁడు సమవశ్యవిషయము నఁ బ్రశ్న చూడుము.

విద్యా.—రాజును గుఱించి యడుగుచున్నారు. నా జోస్యమే నా జోస్యమును పూర్వపక్షము చేయుచున్నది!

యుగం.—ఎట్లు?

విద్యా.—ఏలిన వారియొద్దనుండి తమ్మునికి జాబువచ్చుచున్నది, ఆరు నెల మీఁద; గడియదూరములో నున్నది. మఱి నా జోస్య మేల?

యుగం.—సారాంశము. రెండుమాటలు.

విద్యా. (మత్తకోకిల)

దండుఁ బాయుట, యొంటి నొక్కఁటఁ దాఁకఁ గైదుపు లేక యే
రెండు బెబ్బులుల న్వధించి [1] కిలి న్ధర న్పడఁ జేతయుఁ,

---

ప. 1. పందిని.

కండ నెత్తురు మెండు వోవుట, గానలోపల మూర్ఛయుండఁగా,
దండలో నొకపల్లియ న్నయనంబు విప్రగృహంబునఁగా, ౫

వచ్చినది జాబు. [అందఱు ఆశ్చర్యముతో ద్వారమువైపు చూతురు.

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి. [అని యుగంధరుని చేతికి జాబిచ్చి] అంచెమనిసి జడివానలో తడిసినట్లు జోరుచెమటలతోటి చాపరువున ఇది నాచేత బెట్టి నేల బడిపోయినాడు.

యుగం.—పోయి వానిని దేర్పుము.

ప్రతి.—చిత్తము. [అని నిష్క్రమించును.

యుగం.—[జాబు విప్పి చూచుకొని] విశ్వాసరావు, సునామణి.

విశ్వా.—[లేచి పుచ్చుకొని చదువుచున్నాఁడు.]

“శ్రీమజ్జగద్విఖ్యాత లోకాతీత నీతిప్రతాప దేదీప్యమానులకు శ్రీమత్కాకతీయ రాజలక్ష్మీసగర్భ్యులగు జనార్దనమహామాత్యులకు.—

రచితాంజలిబంధుండై ప్రతాపరుద్రమహారాజు విన్నవించుట:—పేటలో నొంటిఁజిక్కి ప్రణీతులమై బెడఁదపూడిలో బ్రహ్మశ్రీ రామావధానులవారి యింట నున్నారము. తమరు వచ్చి మమ్ము తోపే నగరు చేర్చవలయును.

[మొహరు] “ప్రతాపద్ర మహారాజు,”

[అందఱు విద్యానాథుని, యుగంధరుని, పరస్పరమును, చూచుచు హెచ్చరిక సంజ్ఞలతో ఆశ్చర్యపడుదురు.

విద్యా.—[పరమానంద మభినయించుచు] మఱేమి భయము లేదు. కొంచెము కాలయాపన గాని సదిరి స్వస్థ మగును.

యుగం.—మఱి యేలినవారివార్త వచ్చినదిగదా. అస్వాస్థ్యమునకు ఖేద మగుచున్నది. దైరగతి! జనార్దనా, చిన్నదండుతో నీవును విద్యానాథుఁడును పోయి వారిని తెండి. [సభ్యులతో] మీయందఱి యెదుటను మా పెద్దతమ్ముని విద్యానాథుని మాలో నొక మంత్రిగా నియమించితిని. మీకు సమ్మత మగునా?

అందఱు.—మహాప్రసాదము.

యుగం.—అటయినచో నిదిగో ఫర్మానా. [అని తాను వ్రాసినఫర్మానా యిచ్చును.

విద్యా.—మహాప్రసాదము. [అని పుచ్చుకొని కన్నుల నద్దుకొనును.

యుగం.—ఏలినవారి యస్వాస్థ్యముచే చిత్తము వ్యాకులముగానున్నది. మఱి యిప్పటికి సభ చాలింతము. [అందఱును లేతురు.

చేతా. ప్రభృతులు.—ఏలినవారికి క్షేమము కలుగవలయును.

[అని మంత్రులకు నమస్కరింతురు.

మంత్రులు.—స్వస్తి స్వస్తి స్వస్తి. [ఇతరులు నిష్క్రమింతురు.

యుగం.—కూర్చుండుఁడు, [ముగ్గురును కూర్చుండుదురు.

యుగం.—మీరు ఈ పేరిగానిని తోఁగి ప్రతాపరుద్రమహారాజును చేరవలసినది. ముందుగా, మహాకవీ, నీవు ఈ రాత్రి వీనిని రామావధానులవారివద్ద చేర్పవలయును. జనార్దనా, నీవు సపరివారముగా పోయి ఏలినవారి బంగారపు సవారీలో వీనిని తెచ్చి రేపు నగరు చేర్పవలసినది, రామావధానులకు పేరగానిచేత ఈ శ్రోత్రియమిప్పింపవలసినది. ఇదే దానశాసనము. [అని జనార్దనుని చేతికి కాగిత మిచ్చుచు] కృత్యవిశేషములు వచ్చి చేరిన పిమ్మట తెలియును.

విద్యా.—

ఉ. రాజు నొసర్చె, [1]విక్రమము, దిరంబుగ దేవత వేయిపగ్గముల్,
భ్రాజితబుద్ధి దాని నలబట్టి రచించెను రెండుపేలుగా;
నా [2]జనయిత్రి యొక్కనినె నగ్గలియె౯; మహానీయ, యుష్మద
వ్యాజకృపాకటాక్షమున నైతిని మువ్వుర [3]మాశ్రితావనా.

నవీనునియందుంచిన నమ్మకమునకు లజ్జితుఁడనగుచున్నాను.

యుగం.—నీప్రజ్ఞకు ఫల మిది. నీవు కవివి గావు, కవిని అనఁగా ఉశనసుని మించినవాఁడవు. నా నమ్మకము అపాత్రన్యస్తము గాదు.

విద్యా.—ప్రీతివిసంభ్రమముల కర్హుఁడ నయ్యెదను:

యుగం.—సరి. [పేరిగాడు తొంగి చూచును.

యుగం.—[జనాంతికము] వీఁడు నిన్ను వదలఁడు. వీనిని పిలుము. [ప్రకాశము] మఱి లోపలికి పోదము. [పోవుదురు.

పేరి.—[ప్రవేశించి విద్యానాథుని కాళ్లఁబడి] మహాప్రభో ఆ గండమేందో చెప్పండి సామీ, తప్పించుకొని బదుకుతా.

విద్యా.—లేవరా, లే,

యుగం.—విద్యానాథా, నిలిచి చెప్పిరా, పాపము! తప్పింపుము సాధ్యమైన. వాఁడు మాకు మిక్కిలి నమ్మకమైన నౌకరు. [అని ఇద్దఱు నిష్క్రమింతురు.

---

ఉ. 1. విక్రమార్కుని. 2. తల్లి. 3. ఆశ్రితులను రక్షించువాఁడా

విద్యా.—ఇటు రారా. ఇక్కడ ఏకాంతమునకు రా.

[అని పరిక్రమించును. పేరిగాఁడు పరుగునఁ బోయి కుర్చీ తెచ్చి విద్యానాథునికి వేయును. విద్యానాథుఁడు కూర్చుండును. చాకలి మరల పరుగునఁ బోయి విసనకఱ్ఱ తెచ్చి విద్యానాథునికి విసరుచుండును.

విద్యా.—ఓరి, తురకసర్దారుని డేరాకడ నుండు పహరాసిపాయి నిన్ను నఱికివేసి యెల్లిని తీసికొని ఢిల్లీకి పాఱిపోఁ దలఁచియున్నాఁడు.

పేరి.—ఓయి బాబో, తాతల్లో! అమ్మల్లో! నన్ను నరికేశినా నాను బదుకుతాను గాని, యెల్లి లేకపోతే నాను బదకలేను మారాజా. రచ్చించాల రచ్చించాల.

విద్యా.—అల్లరిచేయకు మూర్ఖా. నిన్ను బయటికి పోనీక ఇచటనే నిలుపుటచే నీచావు తప్పినదిగదా. నీవు సదా మాతోనే ఉండు. నిన్నెవఁడును ఏమియు చేయలేఁడు.

పేరి.—బుడ్డిబుద్ది, మ రెల్లిగతి యేలాగ నాసామే!

విద్యా.—ఎల్లిని మేము కాపాడెదము. మేము నీకు సెలవిచ్చినప్పుడు నీవు ఎల్లిని కలసికొనుము.

పేరి.—నాగండం తప్పింది బాబూ! నాగండం తప్పింది నాగురుడా!

విద్యా.—గండము తప్పిన యోగము పట్టవలయునురా.

పేరి.—గుడ్డ లుదుక్కునే ముండావోడికి నా కేమి ఓగం సామీ!

విద్యా.—అటయిన మామాట తప్పునఁటరా?

పేరి.—అమ్మా! దెమ్మదేవుడిమాట తప్పటమే! మరి శెప్పు సామీ ఆ ఓగమేంటో పట్టించుకొంటా.

విద్యా.—రాజయోగమురా.

పేరి.—అట్టంటే తెలీలేదు మారాజా.

విద్యా.—నీవు రాజ వవుదువురా.

పేరి.—నిజమేనా సామే? నిజమేనా? వొల్లు దెలలేదు సామీ! వొల్లు దెలలేదు! [అని నిశ్చేష్టుఁడుగానుండి] మరి నాను రాజానైతే యెల్లేమౌద్ది మారాజా?

విద్యా.—రాణి యగును.

పేరి.—[మీఁదఁ జూచుచు ఆత్మగతము] వవ్వా సారంగా! [విద్యానాథుని వైపు] రానోళ్ల గీనోళ్ల ఆడోళ్లూ వోళ్లూ, నాయాడికి రారుగందా! అళ్లని నూస్తే నాకు బయి మేస్తది మహాప్పబో.

విద్యా.—నీ యెల్లియే నీకు రాణి యగును. అదే నీతో సింహాసనము మీఁదఁ గూర్చుండును.

పేరి.—శింవాసోనంకాడి కత్తే నాకేమో బయిమేస్తగుండి సాస్తుల్లగామీ.

విద్యా.—ఇఁక నేమి భయము?

పేరి.—అవును. ఇంకేం బయిం. ముంగటిమాట చెప్పిసా. [ఆత్మగతము] సింవాసోనం మీద టక్కు శేశి వోరికీ తెల్వకుండా యెల్లిని లంజెని ముద్దెట్టుకుంటా నారంగా. [అని ముద్దుగొనుట నభినయించును.

విద్యా.—[ఆత్మగతము] పురి యెక్కినది. చాలును. [ప్రకాశము] ఓరీ, నేను గురునాథుఁడను గదా, గురువునాజ్ఞ తప్పవుగదా?

పేరి.—తప్పనుసామే, గురునాదుడా, నీ యాగ్గి తప్పను గురుడా. నా సత్తె ప్పెమానకం శేస్తా.

విద్యా.—మఱి చీకటిపడునందాఁక ఎవరితోను మాటలాడక మౌనముగా నుండు. మౌనము తప్పిన యోగము పట్టదు.

[పేరిగాఁడు చేతులతో మాత్రమే దండము చూపును.

విద్యా.—ఆ! అది సరి, యోగము పట్టించుకొనులక్షణము.

[అని నిష్క్రమించును.

పేరి.—నాను రా జయ్యేవోణ్ణి, ఇక అందరూ నా గులాములే అవుతారు. ఈళ్లతోటి నా కెందుకు పలకటం? అయ్యావోరు అయ్యావోరుగాదు, గురునాదుడు; అయ్యోరు శెప్పినమానం బలే చశే.

యెల్లి నా తో గద్ది యెక్కుంటదీ!—జాజి
మల్లి నా తో గద్ది మానుంటదీ!
పేరయ్య రాజంట! పే రెల్లి రాణంట;
తనకు మా మావోళ్లు దండ మెడ్తారంట! యెల్లి నాతో....
సందుల్లో సమయాము శేస్తానురా!—నాను
అందుట్లో సదసాము లాడ్తానురా! యెల్లి నాతో....
ఇంకేమి గావాలరా నాగురుడా! శీక టొడ్డదాకా నరమానవుడితో మాట్లాణ్ణు.

[అని దుముకుచు ఆడుచు నిష్క్రమించును.

---

# పంచమాంకము

స్థలము 1—ఓరుగంటికడ ఖుస్రూఖానుని డేరా.

[అంతట ఖుస్రూ ఉపవిష్టుండై ప్రవేశించును]

ఖుస్రూ.—రాజా వచ్చినా డని నావేగుల్ చెప్పినార్. ఆ మహాలీల్ హాజాములున్ను, అలాగే చెప్పినార్. వలీఖాన్ రాలేదు. అయన రాజాకి కల్సుకో లేదూ కావాలా? మరి నేనే వాయ్యారం జర్పవాలా. వలీఖాన్ యింకా రాకోవడాన్కి కారణం యేమి?

సిపాయి యొకండు.—[చాకిమూట మోచికొని ప్రవేశించి] సర్దార్ సాహెబ్, ఇద్దో తమ్ది దుస్తు.

ఖుస్రూ.—అరే, యి దేమి! యిది ఉతకనే లేదే?

సిపా.—మన చాకల్దానీ లేదూ యెల్లి? అదికి మొగుడికి వలీఖాన్ సర్దార్ పట్టుకొని ఢిల్లీకి పోయినార్, అంటుంది. అందుకోసం అది తన్ను సంపీయేశినా మనకీ నౌకరీకి ఖ్యాడం లేదూ అంటుంది. యేడుస్తావుంది ముండా. నేను యీ దుస్తులు ఎవరికేతా నైనా ఉతుక్కుదామ్కు తెచ్చినాను. ఊరంతా యిదే పుఖార్.

ఖుస్రూ.—ఏం పుఖార్?

సిపా.—బడామంతిర్ యుగంధర్ వచ్చినార్, వలీఖాన్ సర్దార్ పోయే దారీమే జంగల్మే గాళంమే మన పేరిగాడ్కి రాజావేషం వేసి ఖైదు చేసినార్. రాజా గోడాకి కూడ వేటావేషం వేశి ఘూజ్ మైదానంలో వుంచినార్: వలీఖాన్ సర్దార్ మోసంపోయి మహాల్వాలా పేరిగాడ్కి రాజా తల్చి పకడ్లేవు చేశినార్; తీస్కొని పోయినార్. ఇదే ఊరంతా పుఖార్.

ఖుస్రూ.—[ఆత్మగతము] ఆహా! యేమి ఆశ్చర్యం! యేమి యుగంధర్ మంతిరి బుద్ధిశక్తి! అలాగైతే వలీఖాన్ యీదేశంలో లేడు. హా! హా! హా! తెల్సింది. బడామంతిరి వచ్చినాడు మొదల్ పేరిగాడు మా నౌకరీకి రానే లేదు! ఆహా మంతిరి యుగంధర్ ఎంత యుక్తి చేసినాడు! మా సర్దార్ గయా, రాజా ఆయా! హా! యుగంధర్! యుగంధర్.

సిపా.—సర్దార్సాహేబ్. ఆ ఘోడా వోళ్లంతా కానాగాయా లడి తప్పించుకొనివొచ్చి రాజా తబేలామే చేరింది అని మాట. ఈరోజ్ వుథయమే మహారాజా కూడా వొచ్చినార్ అని పుఖార్.

ఖుస్రూ.—[స్వగతము]యిక మంతిరి యుగంధర్ మాకి మాలవ్వుర్కి ఛణం లోనో ఛణంలోనో సఫాయి చేస్తాడు. బడామంతిరికి మా రాయభారం మోసం తెల్సిపోయింది. [ప్రకాశము] అరే. ఇంకా యేమీ తెల్సునూ నీకీ?

సిపా.—రాజాకి పేటాలో ఘాయం అయింది, ఖాయిలా చెప్తార్.

ఖుస్రూ.—హా! యీ పమయంలో యంధరంరాజ్ సాస్తురిల్ భాయి వుంటే యెంతా పహాయం వుండును!

[ అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును ]

చెక.—సాయముగా నుండుటెడల సిద్ధముగా నున్నాను.

సిపా.—సలాం. [అని నిష్క్రమించును.

ఖుస్రూ.—సాస్తుల్లుభాయి, సర్దార్ వలీఖాన్ యెక్కడవుండేదీ జోస్యం చెప్పండి. మాకి అపాయం వుందీ లేదు, జయం వుందీ లేదు కూడా జోస్యం చెప్పండి.

చెక.—వలీఖాను గోదావరి దాఁటి ఎనిమిదామడ నడచినాఁడు. శీఘ్రగ వేఘాలమీఁద ఎగిరి పోవుచున్నాఁడు.

ఖుస్రూ.—అంత జల్దీ పోవడానిక్కి కారణం యేమి?

చెక.—రాజనుకొని చాకలిని, ఇక్కడ నౌకరిచేయుచున్నవానినే, పేరిగానిని పట్టుకొన్నాఁడు. వెనుకనుండి రాజు సిబ్బంది తఱుముకొని వచ్చు నని భయము. త్వరగా సుల్తానువారికి ఆ ఖయిదీని అప్పగింపవలయునని కోరిక.

ప్రతీ.—[ప్రవేశించి] సర్దార్సాహేబ్, వలీఖాన్ సర్దార్సాహేబ్ దగ్గా నుంచి తురుఫ్జవాను కబుర్తెచ్చినాడు.

ఖుస్రూ.—తచ్ఛనం రమ్మను.

ప్రతీ.—చిత్తం. [అని నిష్క్రమించును.

జవాను.—[ప్రవేశించి] సలాం సర్దార్సాహేబ్. సర్దార్ వలీఖాన్ గారు దేవం రాజాకీ పట్టినార్, ఢిల్లీకీ తీస్కాని యెల్లిపోయినార్. తమగీ చప్పినార్— ముట్టడీయేసి వోరంగోలు పట్టవల్సింది, రాజాఘోడాకి పట్టి ఢిల్లీకి మాకాడిక్కి పంప వల్సింది. దానిక్కి మేము సుల్తానువారికి నజర్ చేస్తాం.

ఖుస్రూ.—ఏమి సాస్తుల్లు భాయి? జవాన్ యీలాగ చెప్తున్నాడు?

చెన.—ఇతని కేమి తెలియును! ఎవరేమిచెప్పినను సరియే, నాజ్యోస్యము తప్పదు.

జవాన్.—[ఆత్మగతము] ముసల్మానీ వేషం, బొమ్మన్ మాట! ఎవరీన? [ప్రకాశము] ఏమి మీ జోస్యం బొమ్మన్ సాబ్?

చెన.—రా జనుకొని చాకలిని మీ సర్దార్ పట్టుకొని పోయినాడు.

జవాన్.—ఛీ ఛీ ఛీ ఛీ! జూటాభాత్ జూటాభాత్! నా శేతుల్తో నేను రాజాకి సంకెళ్లు వేసినాను నోయి!

చెన.—ఘూం ఘూం ఘూం ఘూం! డోబీకి పేరగాడ్కి నీచేతుల్తో సంకెళ్లు వేసినావు గోయి.

జవాన్.—ఆశే నీవు యిట్లా మాటా చప్తే నాకీ బలే మంటా వస్తుంది.

చెన.—గోదావరిలో పడు చల్లారుస్తను.

జవాన్.—కబడ్దార్ బొమ్మన్.

చెన.—బొమ్మన్ కబడ్దారే. నీవే డబడ్దార్, బడద్దార్, బకడ్దార్, ఒకనిం బట్టి ఒకనిం జెప్పుచున్నావు.

జవాన్.—మేము రాజాకి...

చెన.—మీరు పేరిగానికి...

జవాన్.—సర్దార్సాహెబ్. ఈ బొమ్మన్కి పాడీచేస్తాన్.

చెన.—తురక పోడుము మేము తాకము.

ఖుస్రూ.—ఆయనమాట నీవు వినవు. నీమాట నీవు చెప్పూ.

చెన.—వీనిమాట చెప్పే.

జవాన్.—మేము రాజాకి ...

చెన.—మీరు పేరిగానికి ...

జవాన్.—[చెనముకిని రోషపూరితముగా చూచుచు] మేమూ రాజాకి టాంజాన్ మే మోస్కానిపోయి పడ్వాలో పెట్టినాం

చెన.—[బిగ్గరగా నవ్వుచు] ఆశే జవాన్ నీవు చాకలికి సవారిమోసితివిరా.

జవాన్.—[బాధ దూసి] మేము చాకలికి సవారి మోస్తాం?

[అని పొడువఁబోవును. చెనముకికా స్త్రీ అత్యంతముగా నవ్వును. ఖుస్రూ కత్తి దూసి జవానును నఱకఁబోవును. జవాను అల్లా అల్లా అని పాఱిపోవును.

ఖుస్రూ.—మాఖుద్ది చాలా గంధగోళం అయింది. ఖోష్నూలు ఖాయి. యీ ముండాకొడుకల్ యీ ముస్తఫా ఫిరోజాలు మేము లడాయి అంటే వీళ్లు రాయబారం చెప్తార్, మేము రాయభారం చెప్తే వీళ్లు లడాయి మొర్గుతార్. క్యా కర్నా ఖాయి?

చెన.—వారిద్దఱు కేవలభ్రష్టు లని నేను మొదటనే చెప్పలేదా?

క. వారికి హుక్కా, [1]కంచెఱ,
సారాయి రహస్యగోష్ఠి, [2]షామాత్, భంగి;
వారికి లడాయి తెలియునె?
వారిమొగంబులకు రాయబార మెఱుకయే? ౧

ఖుస్రూ.—యీముండాకొడుకలబుఱ్ఱల్ తీయించివేతునా?

చెన.—వారివలననే యీ యాలస్యము, లేదా, వసీఖాట్ పోయిన మాఱు నాఁడే మీరు కోటను పట్టియుండవచ్చును. మఱి యిప్పుడైననో? నీ సేనావధూఁటిని,

ఉ. ముందు ఫిరోజు ముస్తఫ [1]సముత్థకుచాకృతి [2]మ్రొగ్గఁజేయఁగా,
మందతవెన్క [3]శ్రోణియుపమఁ [4]దుముదార్ధారవీవు [5]నిల్పఁగాఁ,
[6]అందువు గల్లుగల్లు రన నట్టిటు తొట్రిలు కామపీడితఁ
[7]మందవిచార [8]సంధ్రవృతనాపతి [9]కౌఁగిటిలోఁ [10]గరంచుఁబో! ౨

ఖుస్రూ.—హా! అల్లా! అల్లా!

చెన.—మఱియొక మాట, దిగులుపడ వలదు. యుగంధరునికి మీరు గడి యు కాలమిచ్చినది కూడ తప్పే.

ఖుస్రూ.—యేమి చేసినాడు! యేమి చేసినాడు! యేమి చేసినాడు!

చెన.—మీమీఁదికి రెండువైపుల రెండు లక్షలు పంపినాడు, మిమ్ము రూపుమాపుటకు. మఱి.—

ఖుస్రూ.—మఱి యింకాయేమి?

౧. 1. వేశ్య. 2. చదరంగము అని భా.

౨. 1. నిక్కఁజన్నులవలె. 2. ముందఱికి వాల్పఁగా, యుద్ధమునకు ఫురికొల్పఁగా నని భా. 3. పిఱుఁదువలె. 4. సేనయొక్క వెనుకటిభాగమును నడుపువాఁడవు. 5. యుద్ధము వలదని మాన్పఁగా. 6. ఏనుఁగుల కాళ్లకు కట్టుగొలుసు, కామజయేచ్ఛసంభోగేచ్ఛ. 7. ఆలోచన చాలని దానిని. 8. ఆంధ్రసేనానాయకుఁడు=వేతాళనాయకుఁడు. 9. అన్నిప్రక్కలంబాదివి. 10. దూపుమాపుసుజూపూ.

చెకు.—శ్రద్ధగా వినవలయును. మంత్రి, కోటలోనుండి మీ శిబిరము క్రిందికి సొరంగాలు త్రవ్వించి వానినిండ తుపాకిమందు నింపించినాఁడు. ఇఁక గడియలో మీ శిబిరము గుర్తుండదు. పాతిపోయిన అక్షలు లక్షలు దండు పొదివి నలుగ నున్నది.

ప్రతీ.—[ప్రవేశించి] సర్దార్ సాహెబ్, రాజావారి దుబాసి.

ఖుస్రూ.—రమ్మను.

ప్రతీ.—సర్దార్సాహెబ్ హుకుం [అని నిష్క్రమించును.

దుబాసి.—[ప్రవేశించి] సలాం ఖుస్రూఖాన్ బహద్దరువారికి. మా యేలిన వారు ప్రతాపరుద్ర మహారాజుగారు వేఁటనుండి ఈ యుదయమే వచ్చినారు. వారికి మహామంత్రులు మీ రాక రాయబారము తెలిపినారు. వారు మీ రాయబారము మోసమని తలఁచినారు. 'కాకుండిన చాకలిని ఏల పట్టుకొనిపోవల యును?' అన్నారు. ఇప్పుడు మహామంత్రి యుగంధరులవారు మీకు తెలుపుట యేమనఁగా—"మా చాకలిని మరల మాకు సురక్షితునిఁగా అప్పగింపు మని మీరు మీ సుల్తానువారికి కబురు చేయవలసినది. మమ్ము మోసము చేసినందుకై జరీఖాను తల కొట్టి మాకు పంపవలసినదనియును మీరు మీ సుల్తానువారికి కబురు పంపవలసినది. చాకలియు జరీతలయును మాకు చేరువఱకు మీరు మీ క్రిందిసర్దార్లు మా ఖైదీలు. ఈ దండంతయును మా బందిఖానాలో నరకము. మీ యాయుధములు సామానులు యావత్తు మావి. లేదా యుద్ధము. కాలము ఇయ్యాము." అని. ..ఏమి జవాబు?

[ఖుస్రూ ఏమియుఁ తోఁచక యూరకుండును.

చెకు.—నాయీ స్వయంగా మహామంత్రిగారికి మహారాజాగారికి దర్శనం చేసి జవాబ్ ఇస్తాన్.

దుబాసి.—[చెకుముకిని నిదానించి చూచి] ఓరి కాలయముఁడా, ఏమోయి తురకలలో కలిసితివి? ఏమి నీకు వచ్చిన వినాశకాలము? ఛీ! పాపీ? ఛీ! పాపీ?

చెకు.—వినాశకాలం నీకీ వచ్చింది. కభుర్దార్ బేజవాబ్ గాడ్దెకి యింత పొగర్! [అని దుబాసికి ఒక చెంపకాయ యిచ్చును. దుబాసి చెకుముకికి ఒక చెంపకాయ యిచ్చును, అది తలపాగకు తగులును. పాగ పడిపోవును, జుట్టు అగపడును.

దుబాసి.—[జుట్టును సూచించి] జుట్టున్నదీ! బోడి యనుకొంటిని! ఏమి యింత చదివిన బ్రాహ్మణునికి వచ్చిన యీ వినాశకాలము! [అని అంగి లాగి జందెము

సూచించి] జందెము కూడ నున్నది! మతములో కలియలేదా? మంత్రములో గలిసితివా? కడుపుకోసమా? ఉండు నిన్ను మహామంత్రి యుగంధరుల వారితో చెప్పి మహమ్మాయి చేయించెదను. సర్దార్ సాహెబ్, ఏమి జవాబ్? జవాబు లేదు. నేను పోయెదను.

[అని నిష్క్రమించును.

చెవు.—ఈ సంకుమూతి తంట లొంద్ర పెట్టును. నేనును బోయెదను.

ఖుస్రూ.—అరే, యీ గడ్బిడాలో మా భద్ది బుఖ్ఖీ ఖాలీ చేసింది. ఏమి భాయి, పొడుచుకొని సచ్చిపోదునా?

చెవు.—ఇసీ! ఇసీ! ఇసీ! నీ యాజ్ఞచే తిరుగఁబడిన వారిని పోషించి వేయవలయును గాని, నీ వేల పొడుచుకోవలయు! [ఆత్మగతము] వారు నిన్ను పోషించి వేయుదురు. [ప్రకాశము] మఱి యీ యుద్ధములో నన్ను మఱవవలదు. సుల్తాను వారికి సిఫారసు. యుద్ధమైన వెంటనే నిన్ను కలసికొనెదను. కొంచెము ఖర్చులకు మిగత. యుద్ధము ఆరంభమగుచున్నది. మీకు అపజయమును, మీ దండంతయు నాశము. క్రిందినిప్పు మాట మఱవవలదు. ఈదుబానిగానిని నేను కలసికొని నామాట చెప్ప నని ఖరారు చేయించుకోవలయును. ఒప్పనియెడల వానిబుఱ్ఱ నొగ వేసి రావలయును. నీకత్తి కొంచెము దయచేయుము. [అని నిశ్చేష్టుఁడగు ఖుస్రూఖానుని యొరనుండి కత్తిపుచ్చుకొని] నేను నీ గుఱ్ఱముమీఁదనే దీనిని కలసికొని మరలెదను. సలాము భాయి సలాము. దయయుంపవలయును. ఏమోట్లు నిశ్చేష్టుఁడవుగా నున్నావు భాయి? ఈ స్థితిలోనున్న నిన్ను వదలి యెట్లుపోగలను భాయి? మాటలాడు భాయి. ప్రాణమున్నదా లేదా? [అని ఖుస్రూను పట్టి యూఁచును.

ఖుస్రూ.—[నిట్టూర్పు విడిచి] ఏంభాయి, వెల్లండి భాయి. లక్ష సలాములు. మేం ఈపాపిముస్తఫాఫిరోజుల బుర్రల్ తీసి యుద్ధంచేస్తాం, లేదా, పరారి యౌతాం.

చెవు.—ఏలోకమునకైన సరియే మనము మరల కలసికోవలయు, కత్తిగుఱ్ఱము మహారాజవారున కప్పగించి పోయెద. సెలవు సెలవు. క్రిందినిప్పును మఱవవలదు.

ఖుస్రూ.—అరే శే శే! నావల్లు అంతా వేడిగా వుంది భాయి!

చెవు.—ఇఁక బొబ్బలు లేచును. తరువాత కాలిపోవును. సదా కడుపు మండు నా పాదాలు అప్పుడే మండుచున్నవి!

ఖుస్రూ.—[వెఱ్ఱియావేశముతో కఠారి దూసికొని] ముస్తఫాఫిరోజ్ సఫాయి!

[అని పరుగున నిష్క్రమించును.

చెవు.—పోయి మహామంత్రిగారికి నివేదించెద. [నిష్క్రమించును.

స్థలము 2. ఓరుఁగల్లు, మంత్రివాటిక, కచ్చేరిశాల.

[అంతట యుగంధరుఁడు, ద్వారభూమిని ప్రతీహారియు ప్రవేశింతురు]

చెకు.—[ప్రవేశించి] ప్రతీహారీ, పోవచ్చునా?

ప్రతీ.—ఎరిగిన వారి కల్లా దర్శనానికి సెలవు.

చెకు.—పరమసంతోషము. [సమీపించి] జయము జయము మహామంత్రిగారికి.

యుగం.—చెకుముకిశాస్త్రీ, కూర్చుండుము. [చెకుముకి కూర్చుండును.

యుగం.—ఏమి విశేషము? సంగ్రహము.

చెకు.—నేనచట నుండఁగానే తమ దుబాసివచ్చి ఖుస్రూఖానుతో తమ యాజ్ఞగా 'మాచాకలిని తలీఖానుతలను తెప్పించి అప్పగింపుఁడు. అంతవఱకు మీరు మహా ఖైదీలు, మీ యాయుధము లెప్పటికినిమావే,' అని చెప్పి, వానివలన ప్రత్యుత్తరము రానందున బేతాళనాయకునికి యుద్ధానకు హెచ్చరిక చేయుటకుఁ బోయినాఁడు.

యుగం.—తర్వాత?

చెకు.—తర్వాత ముస్తఫాషిరోజులను ఖుస్రూ చంపఁదగలినాఁడు. ప్రతి సర్దారునికిని ఈదినము గండము చెప్పితిని. ఎవఁడును నడపలేదు, తురకరాణువ అనదరైనది. యుద్ధము జరుగుచున్నది.

యుగం.—నీ ప్రయాసకు ప్రజ్ఞకు పరమ సంతోషము.

చెకు.—ఖుస్రూగాని గుఱ్ఱమును కత్తిని తెచ్చితిని.

యుగం.—గుఱ్ఱమును ప్రభువుతబేలాకు మేము పంపెదము. కత్తిని నీ ప్రజ్ఞాధ్వజముగా నుంచుకొమ్ము.

ఒక వడవాలు.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

యుగం.—ఏమోయి యేమి జరిగినది?

వడవా.—తమ యాజ్ఞ ప్రకారము బేతాళరావు నరసింహారాయలు ఇద్దఱు రెండువైపుల తురకలను కమ్మి నఱికివేసినారు, హతశేషులను ఖైదు చేసినారు.'

యుగం.—మిక్కిలి ఏలినవారిని కొలిచినారు. బేతాళరావునకు తృప్తియైనదా!

వడవా.—అతఁడు వీరావేశముచే యుద్ధము ముగిసిన గడియఁదాక కంటికెదురయిన చెట్టును గుట్టనుకూడ నఱుక సాగినాఁడు. ఎవరము, హిరణ్యకశిపు వధా

నంతరము దేవతలు ఉగ్రనరసింహమూర్తిని దఱియలేనట్లు అతనికడకు పోక పైతిమి. మనవారినే శూన్యము చేయునో అని అందఱము భయపడి, యెట్లు హెచ్చరించినను తెలిసికొనఁడాయెను. చివరకు తను పేగట దురాయి పెట్టఁగా తెలివి వచ్చి నిలిచినాఁడు. అంతట నే నిట్లు వచ్చితిని.

యుగం.—బళిబళి, మహాశూరుఁడు, వీరులలెక్క!

పడవా.—మనవాండ్రు రమారమి వేయిమంది. రమారమి తొంబదివేల తురక తలలు రాలినవి. పైవాన పెల్ల రక్తసముద్రము.

చెవు.—అందులో తురక బొందులరాసులే దీవులు. ఇఁక నొకటి రెండు రోజులలో అటు గాలి యిటుకొట్టినా మఱియొకరి ఘ్రాణేంద్రియములను మనము ఎగవు తెచ్చుకోవలసినదే. ఆ కంపుచే ఈ యూరు నాశము. తురకలు బ్రతికి సాధింపక పోయినను చచ్చి సాధింతురు, ఇప్పటికి నా ప్రతిజ్ఞ నెఱవేఱినది.

యుగం.—ఏమి నీ ప్రతిజ్ఞ? [అని వినుచు చీటి వ్రాయుచుండును.

చెవు.—కోటబురుజులకు రాత్రులలో అక్క కొఱవిదయ్యములను చూపెద నంటిని. అది యింక నూఱేండ్ల దాఁక సిద్ధించినది. మఱియొకటి కూడ సిద్ధించినది.

యుగం.—అదేమి? [అని వినుచు ఆచీటియే వ్రాయుచుండును,

చెవు.—ఇఁక నూరేండ్ల దాఁక ఈ నగరములో స్త్రీలకందఱకు తురక పిశాచములే గాని హిందూ పిశాచములు పట్టవు?

యుగం.—పడవాల్లూ, మీరందఱును మీ ప్రయాసమునకు ననంతఫలము ననుభవించెదరు. పోయి బేతాళరావుతోను నరసింహరాయలతోను మామాటగా ఏలినవారికి మిగుల గణనీయులైతిరని చెప్పుము. ఈచీటి బేతాళరాయని కిమ్ము. [చీటి ఇచ్చును.

పడవా.—[చీటి కైకొని] మహామంత్రిగారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

యుగం.—చెవుముకీ నీవు తత్క్షణమే [చెవిలో ఏమో చెప్పి] ఈమాటను పెద్ద సెట్టికి చెప్పి, ప్రకృతము నగరిలో రాజసన్నిధిని మాతమ్ములతోఁ జేరుము.

చెవు.—మహాప్రసాదము. [అని నిష్క్రమించును:

[అంతట ఒకరౌతు రొఁజుచు ప్రవేశించును]

రౌతు.—జయం జయం మహామంత్రిగారికి. రాణీగారు ఏలినవారిదర్శనానికి వచ్చినారు. మంత్రులున్ను వైద్యులున్ను వల్లపడవన్నారు. మేము మూఁడుకమాన

మని దేవిగారు తమతమ్ములమీఁద కోపం చేస్తున్నారు. నన్ను వారిద్దరున్ను ఇక్క-డికి తరిమినారు. తమరాక కెదురు చూస్తున్నారు.

మఱియొక రౌతు.—[ప్రవేశించి] తమ్ముల మనవి. "రాణీగారిని నిలపలేకున్నాము. వారు సాక్షాత్తు మహిషాసురమర్దని యవుతున్నారు. తమరు క్షణం రాకుంటే అపాయము," అని.

యుగం.—మీ రందఱు పొండి, మీకన్న ముందే మేము వారిసన్నిధిలో నుండెదము. [రౌతులు చేటియు యుగం—నిష్క్రమింతురు.

స్థలము. 3. ఓరుఁగల్లు, రాచనగరు

[అంతట యుగంధర విద్యానాథజనార్దనులు ప్రవేశింతురు]

విద్యా. జనా.—[నమస్కరించి] ఈ ప్రళయము తప్పించితిరి. మఱి మా కాజ్ఞ యేమి?

యుగం.—ఈ ప్రళయమిఁక రాదు. క్రొత్తవేమయిన వచ్చిన, మీనీతివిభవము. మీతో చెవుమికి చేగును. పేరిగాఁడు రాజుగా, మీరు ప్రతాపరుద్రనాటక మాడవలయును. ఇఁక ఏడుమాసముల పదిదినములకు మరల మీకు మాదర్శనము. మేము ఎక్కడికో? ఏలకో? మా సంకేతము గలచారులు తెలుపు మా యాజ్ఞలు నెఱవేర్పవలసినది. తృణము నవనిధులుగా నవనిధులు తృణముగాఁ జూఁడుడు. అన్నమరాజు కటకము నుండి వచ్చిన, మీకు సర్వసాహాయ్యము.

విద్యా. జనా.—[యుగంధరుని పాదముల వ్రాలి లేచి కన్నీళ్లతో]

క. తమరూపమె ధ్యానం బగుఁ
తమపేరె జపంబు, సర్వదా యిఁక మాకుఁ,
తమరు ప్రసన్నతఁ బ్రత్య
క్షమై మముం బ్రోచువఱకుఁ గడిఁదితపముగాఁ. ౧౨

యుగం.—చిరం జీవతమ్. చిరం జీవతమ్. 'బ్రతికియుండిన సుఖములు పడయవచ్చు,' ఇఁక మీపని చూచుకొనుఁడు.

విద్యా. జనా.—చిత్తము. [అని నిష్క్రమింతురు.

యుగం.—ఆడఁబోవు మహానాటకమునకు ప్రస్తావనయైనది. బేతాళరాయనికి ఆచీటి చాలును. పెద్దసెట్టికి ఆమాట చాలును. పడుగు నేయుట క్షణము, పేక నేయుటకు మాసములు. మంచిది! నేను లేనప్పుడుగదా వీఁడు పట్టినాఁడు! నేనెట్లు లేక పోదునో చూచును గాక. [సచింతము, సబాష్పము] హా! నా రాజును వీఁడా హరించువాఁడు! [సావష్టంభము]

స్రగ్ధర

పాతాళంబందుఁ గానీ, ప్రళయపవనగర్భంబునం దైనఁ గానీ,
శ్రోతుర్గాత న్మహీశు న్దురకలు బలవద్దుష్టదైవావచేష్టన్;
చేత న్నే నందికొందున్; సిరిమెఱయ నిటన్ సింహపీఠాసనుం తున్,
ఖ్యాతి న్ఢిల్లీపురీశు న్గరువ మెడల నా ఖైదిగాఁ గట్టి తెత్తున్.

[అని నిష్క్రమించును.

---

# షష్ఠాంకము

స్థలము.—ఓరుగల్లు, రాచనగరు

[ అంతట ఇద్దఱు నౌకరులు ప్రవేశించి తివాసులు మొదలగు నాస్తరణములను పఱిచి సరుదుదురు ]

ప్రథముఁడు.—ఓరి వ్యాఘ్రపాదా, ఈదినము మంచి వినోదమురా.

ద్వితీ.—ఆంజనేయులూ, ఇన్నాళ్లు మంత్రులు తల బ్రద్దలు కొట్టుకొని వీనికి నూఱిపోసిన యుపదేశము నేఁ డేమయిన ఫలించునా!

ప్రథ.—ఫలించును, వీనిని పుటము వేసిన.

[ అంతట విద్యానాథ జనార్దనులు పేరిగాఁడును ప్రవిష్టులై కూర్చుందురు ]

జనా.—రి పేగా, మా యుపదేశ మేమి చేసితివి?

పేరి.—శిమతలకాయంతైనా వొదలకుండా యీడొక్కలో రొట్టుకొనున్నా.

---

౧౨. తురకలు బలీయమయిన దుష్టవిధియొక్క దుశ్చేష్టచేత రాజును పాతాళములో దాఁచిన దాఁతురుగాక, ప్రళయకాల వాయువుకడుపులో పెట్టినం బెట్టుదురుగాక, నారాజును నేను చేతితో అందుకొని తెచ్చెదను...

విద్యా.— ఏలినవారిని సిద్ధముచేయుదము. గాయకులు వచ్చియుందురు.

ప్రతీహారి.—[ప్రవేశించి] జయము జయము యేలినవారికి, గవాయీలు వచ్చి వున్నారు.

మంత్రులు.—శ్రుతి గితి చేసికొని సిద్ధముగా నుండు మను.

జనా.—పులిగా, ఏలినవారికి స్వారస్యపుఁ బ్రాడు కట్టు.

[ద్వితీయుఁడు పేరిగాని జుట్టునకు పొడుగుపాటి త్రాడుకట్టును.

జనా.—ఎవరోయి అక్కడ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారియాజ్ఞ?

జనా.—గాయకులను రమ్మను.

ప్రతీ.—చిత్తము. [అని నిష్క్రమించును.

[అంతట వైణికుఁడు, గాయకుఁడు, మార్దంగికుఁడు, మోర్సింగువాఁడును ప్రవేశింతురు]

మంత్రులు.—కూర్చుండి మీవిద్య చూపుఁడు.

[ముప్పురును సభావందనముచేసి కూర్చుందురు. వైణికుఁడు 'చంద్ర కళాధర సాంబ సదాశివ' అని పల్లవిపాడి వాయించును.

పేరి.—వహ్వా! వహ్వా! [అనుచు వినుచుండును.

పేరి.—ఒకసారి నా నోకచేపిని పెంచినా. అది రాత్రిలో అడచేపిని నూస్తే యింతకంటారెయ్యింతలు కుయి కుయి కుయి కుయి అనేది. దానికంటా దీని యిసేసంయేంటీ అంటా.

విద్యా.—[పేరిగానితో] ఏలినవారు చమత్కారముగా పలుకుచున్నారు. మేమును అట్లే ఉత్తరము చెప్పెదము. దీనికి అఁడుచేపి అక్కఱలేదు. అదిలేకుండనే యిది కుయి కుయి కుయి కుయి అనును, మఱి దీనికి గంజి అక్కఱలేదు.

జనా.—అది దివ్యముగా పాడఁగలదు.

పేరి.—ఆపాట గీట నాకు తెల్దుగాని, నాచేపిలాగ మొఱిగించండి నూరాం.

[వైణికుఁడు మొఱిగించును. మార్దంగికుఁడు అనుసరించును. పులి. స్వారస్యపుఁ బ్రాటిని లాగును.

పేరి.—[పకపక నవ్వి] వహ్వా వహ్వా! వహ్వా వహ్వా! అచ్చరి అచ్చరి; ఒక అచ్చరనచ్చ యినాం, ఒక అచ్చరనచ్చయినాం, ఒక అచ్చరనచ్చయినాం. అదీ సారా కెంబు! అద్దదీ సారాకెంబు! [అందఱు గొల్లుమని నవ్వుదురు.

[పేరిగాఁడును తన ప్రజ్ఞకు సంతుష్టి తెలుపుచు నవ్వును.

మంత్రులు.—ఆహాహా! ఏమి యేలినవారి బుద్ధిప్రభావము! ఏరాత్రి యందుగం ధరద్వితీయులై మాఱువేషమున పేటలు తిరిగినప్పుడు నేర్చినారో యీ గానీయము! అదే విద్వాంశ్. 'నావిష్ణుః' అన్నారు. పాట రానిండు.

పేరి.—[నవ్వుచు] ఇచ్చాలు. నాకు కడుపు నొస్తూంది. ఇంక నేను నవ్వలేను. ఆ అయ్యవోరిని పాడమనండి. [గాయకుఁడు పాడును, అనుచరుఁడు కర్పూర శలాకను తెచ్చి పేరిగాని చేతిలో పెట్టును.

పేరి.—[ఆడంబరముగా దానిని చేత నెత్తి] ఉండవయ్యా గిరం గుండో. ఊరక పాడుకపోవటమే? కళ్లకి కప్పూరసలాక అంటించుకోనియ్యవేమి? నీ పాటకి ఆనంధబాస్పాలు అక్కర్లేదా యేంటి?

గాయ.—[స్వగతము] ఈపిరపువరియ వింతెగా నున్నదే? [అని పాడును. మార్దంగికుఁడు, హార్సింగువాఁడును, వాయింతురు. పులి. స్వారస్యపుఁద్రాటిని లాగును. పేరిగాఁడు తలయాడించును, కర్పూరశలాకచే ఆనందబాష్పములు విడుచును.]

పేరి.—అబ్బ! నాకళ్లంతా పోతున్నయ్యాయ్యా యీ ఆనంగబాస్పాలతోటి! మఱి, యీన నెత్తిమీఁద రొవ్వంతకొప్పు, మెళ్లో ఒకచేటే అడేంటో తోటిసందుం గింజ; ఇయ్యి మొయ్యలేక యీన బుఱ్ఱ యిసిరియిసిరి, మెడతిప్పితిప్పి, కళ్లుమూసి పడి, నాలి కళ్లబెట్టి, తనుకలాడతావున్నాడుగందా, నాగాడిద నడుగు బిగుగు లేకుండా యెన్ని మాటలు మోశేదిరా నారంగా! దానిముంగట యీ సంగుకు పని కొస్తాదా అంటా?

మంత్రులు.—[పేరిగానితో] పాటచిత్తగింపవలయును. [గాయకునితో] పాడవయ్యా. [గాయకుఁడు మంద్రముపాడును. మృదంగము, హార్సింగు, అనుసరించును.

పేరి.—పాటలోమాత్రం యీ నెచ్చేంటీ అంటా! నాగాడిద ఓంద్ర మొడిగే లేవు లేవంతా రోయి రోయి రోయి అంటా మోగిపొయ్యేదే! ఈన పాడితే యేప మోగమను. యిక్కడికే యినపట్టంలేదే!

గాయ.—[స్వగతము] ఏమిగ్రహాచారం వచ్చెరా యీశ్వరా!

[అని మధ్యమము పాడును. పులిగాఁడు దాగము లాగును.

పేరి.—[తలయూఁచి] అద్దదీ! యిప్పుడు కొంచెం వోంద్రానికి నీను పొతావుంది పాట. మా గాడిదికి శేరు పొతా వున్నాడీయన.

[గాయకుఁడు మఱియు స్వాగస్యముగా తారను పాడును. హార్సింగువాఁడు వాయించును.

పేరి.—[నవ్వుచు] వహ్వా! వహ్వా! మా గాడికే! మా గాడికే! అన్నం పోగాడికే! ఏదీ యేదీ మల్లీ! [గాయకుఁడు మఱియు స్వారస్యముగా పాడును.

పేరి.—[అట్టహాసముతో] వహ్వావహ్వా! యెంతటి బ్యామ్మడవయ్యా! ఎంతటి బ్యామ్మడవయ్యా! మా గాడిదికి నువ్వు అన్నవో తమ్ముడివో కావాలగాని మరి కోడివిగావయ్యా! నీకు అచ్చరనచ్చ లిచ్చేశివా.

గాయ.—మగాప్పిరవూ, పూలోక తేవేందిరా, నేను ఇంకనూ సొగ చెక్కగా పాడుతును. తగిన వెగుమతి యియ్యవల్య.

పేరి.—నాదంతా. పాడు, యిచ్చేస్తా. [గాయకుఁడు ఓండ్రపెట్టును.

పేరి.—[విభ్రాంతుఁడై ఆశ్చర్యపడుచు] ఏమి బ్యామ్మల పెభావం! ఏమీ బ్యామ్మల పెభావం! యీ యిద్దలకే 'బ్యామ్మడో బెమ్మదేముడో' అన్నారు.

మంత్రులు.—ఇట్టి రసాభాసము చేసిన విద్యావంతులు తమకడ కేల వత్తురా?

పేరి.—ముందత్తిగా ఆయనకి కోటివొరా లిచ్చి మరి నాతో మాట్లాడండి.

మంత్రులు.—సిద్ధము. కచ్చేరీ లేచునప్పు డిచ్చెదము.

ప్రతీ.—[ప్రవేశించి] జయం జయం ఏలినవారికి. ఆటగత్తె వచ్చి వుంది.

గాయ.—అది మాతో వచ్చిందదా.

జనా.—ఆలాగా? మంచిది. [ప్రతీహారితో] రమ్మను.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ.

పేరి.—ఆట కత్తేంటి? కత్తి ఆడుద్దా?

విద్యా.—కత్తి గాదు.

పేరి.—కత్తోట్టుకొని మనిసి ఆడుద్దా యేంటి?

విద్యా.—[చెవిలో] ఛీ! ఊరకుండు!

[అంతట నటి ప్రవేశించును]

పేరి.—యేంటయ్యా, అప్పుడే రమ్మన్నారు? ఈ సారాశింబుతాడు, యీ ఆనంధబాష్పాలు, ఈటితోటి నాపానం పోతావుందయ్యా. [నటితో] గొవ్వంత సేపు ఆడక పాడక వూర్కో. [నటి సభావందనము చేసి నిలుచును.

పేరి.—యింబ్యాణ, యీ పాట, యీటికాత నావొల్లంతా సందేగాలే అయినయ్యండీ, అడుగుతాను తీరుస్తారా?

జనా.—సందేహములు అవతల తీర్చుకోవచ్చును.

పేరి.—ఇప్పుడు గావాల. లేకపోతే సారాశెంబు సెడతది. యీళ్లు పాడతావున్నా, పోయిస్తావున్నా, నాను సూస్తానూ వున్నా, యింటానువున్నా. యీ పాట కనాళ్ల కవుపడ్డదా? నా సెవుల కినపడ్డదా? సప్పండి.

జనా.—ఈ సందేహాలు తర్వాత తీర్చుకొందము. [నటితో] ఆట కానిమ్ము.

[నటి పాడుచు ఆడును. మద్దెల - వాయించుచు అనుసరించును.

పేరి.—ఒరే, ఆడు ఆడికడుపుమీద్దాన్ని కొట్టుకొంటే నువ్వెందుకే యాడవటం, యగరటం, దుమకటం, చేతు లిసురుకోట్టం? నా కాళ్లా నీటమ్కలు? నీకేమన్నా తగిలిందా? పోనీ, [కనికరముతో] నీకేం పోయిందిరా, చేతు లలా యిసిరేశేవు? ఓత లేయిస్తానే యాడవకు. అయినా గానీ, నువ్వు అడికాడుండద్దు, నువ్వీమాల్నుండు. కాకిని కొడితే గద్ద సచ్చిం దంట! [మద్దెలగానితో] ఒరే, నువ్వు దానెంబడి తిరగటం యేంట్రా? యెంకటయ్య కడుపులాగ ఉన్నొక్కటి ముంగ లేసుకుని ఆడపిల్లని దాన్నెందుకురా జడిపిస్తావు? డమా అనిపిస్తావు! డుమా అనిపిస్తావు! టాంటాం అంటావు! టముటము అంటావు! నువ్వీమాల్నుండు, వొకరి మొకం వొకరు నూడకండి. [నటీమార్దంగికులు అట్లే చేయుదురు.]

పేరి.—మరింక కానీండి.

నటి.—[మంత్రులకు చేతులు మోడ్చి] స్వామీ, యేలినవారి అభిప్రాయం తెలవ లేదండి.

విద్యా.—[పేరిగాని చెవిలో] తిన్నగా ఆడనీయకపోయితివా తర్వాత యమధర్మరాజశాస్త్రులతో చెప్పి డొక్క బ్రద్దలు చేయించెద.

పేరి.—[జనాంతికము] బుద్ధిబుద్ధి. [ప్రకాశము] మాలేమీ లేదు ఆడండి.

[నటి ఆడుచు పాడును.]

అఠాణా, ఏకతాళము

నిమ్మఁ గవి యెన్ను కొను కన్నె మది సున్న,
ఆ కన్నెమది సున్న, ఆ కన్నె....ఆ కన్నె...ఆ కన్నె....
ఎవ్వరిది దోస మిదిః ఎవ్వగను మాను నిదిః
మవ్వమునకన్న, నీ మవ్వ...నీ మవ్వ ..

[నటి ఆడును. స్వారస్యము హెచ్చును. మార్దంగికుఁడు అనుసరించును, పులిగాఁడు దారము లాగును. పేరిగాఁడు తల ఆడించుచుండును.

పేరి.—మా లేవంతా వొక్కపాలే పుదికినా యీ యెంకటయ్య కడుపుకి చరిరాదురా. [అని మిక్కిలి తల యాడించును. స్వారస్యపుఁబ్రాఁడు తెగును.

పేరి.—హాహా! నిలునిలు. నిలవోసి నిలు, సారా శెంబుతాడు తెగిపోయింది.

[అని జుట్టు తడవుకొనును. కొందఱు గొల్లుమని నవ్వుదురు. కొందఱు ఆశ్చర్యపడుదురు.

పేరి.—[మంత్రులతో] అయ్యో, మరి సబబేలాగ? తాడు తెగిపోయిందే.

జనా.—ఇఁక త్రాడక్కఱలేదు. [నటితో] ఈ పాటచేసిన మహాకవి యెవరు? మంచి తేనెవలె చెంచెతను పొగడుదురుగాని తేఁటిని దలఁపరు.

నటి.—మహాకవి పీయూషవర్షులవారు. వారిశిష్యురాలిని నేను. వారున్ను వచ్చియున్నారు. దర్శనానికి శెలవైతే వస్తారు.

జనా.—అవశ్యము రావలయును. ప్రతీహారీ, మహాకవి పీయూషవర్షులవారు వచ్చియున్నారఁట. తోడ్కొనిరా.

ప్రతీ.—చిత్తము. [అని పోయి కవిని తోడ్కొనివచ్చి] ఆట్లా దయచేయండి.

మంత్రులు.—ఇట్లు దయచేయుఁడు. [పీయూషవర్షుఁడు కూర్చుండును.

పేరి.—నమస్కారములు. మరిగంటే కయిూస్పర్లూ, నాను మెచ్చుకొనే లాగ కయిత్తం శేస్తే ఆబోజనరాజు తను బోంచేస్తుం డేయాల తనకాళ్లుగడ్దవోడికి కాలిదాసుకి యిచ్చినలాగ నీకు నాను అచ్చరనచ్చలిస్తా.

కవి.—ఏలినవారివచనకుసుమ వింతగానున్నది. [అని క్రిందియట్లు ఆశీర్వదించును,

ఉ. [1]జ్యాయసి! [2]నీదుకీర్తి [3]జలజాసనుముందర సంచరింపఁగా [4]రాయనఁ గొల్తుఁగొమ్మ'ని ముదంబున [5]నవ్వలికాంత యెమ్మెతోఁ జేయఁగ [6]మాటిమాటికిని [7]గౌరి [8]సవతి యనఁ దనరారునీమహిమ [9]నేలగలిగెను [10]నరేంద్రచంద్రమా. ౧

మంత్రులు.—ఆహాహా! ఆహాహా!

పేరి.—[హాస్యముఖుఁడై తల యూఁచి యూఁచి విని] దీనికి నాను సాయింపాకమైనా యీను. యిదేం కయిత్తం యిది! సీత్!

---

౧. ఓరాజశ్రేష్ఠుఁడా, 2. నీకీర్తి, బ్రహ్మలోకమున వ్యాపించి, 3. బ్రహ్మ యెదుట, 4. ఆయన భార్యను (సరస్వతిని) ఆమెయొక్క నల్లని వెండ్రుకలను తెల్లగామార్చి, బ్రహ్మకు, 5. ముసలిదిగా అగపడునట్లు చేయుచున్నది; అట్లే వైకుంఠమున వ్యాపించి లక్ష్మికి తనతండ్రి పాలసముద్రము తన్నుఁజూడ వచ్చె ననుభ్రమను పుట్టించి ఆమెచే 'నాయనా నమస్కారమును గ్రహింపుము' అని, 6. మాటిమాటికి పలికించుచున్నది, అట్లే కైలాసమున వ్యాపించి, 7. గౌరికి తన మీఁదికి గంగ అన్ని దిక్కుల నుండియు వెల్లి విరిసిన దను భ్రమను గలిగించి ఆమెకు సవతి, 8. పోరు కల్పించుచున్నది. ఇదియెల్లను నీకీర్తి చేసిన చిలువిప్ప పని ఎఱుఁగినంతట వారు నీ కీర్తిని అడిపోసికొనుచున్నారు,—కీర్తి తెలుపని కవిసమయము. విశ్వవ్యాపకకీర్తి కాలి అని భా.

కవి.—[స్వగతము] మంచి మెడవాయువు. [ప్రకాశము] ఏలినవారు ఈ మాట చిత్తగింపవలయును. [అని మరల ఆశీర్వాదించును.

ఉ. హెచ్చుగ నీవు సత్కవుల కిచ్చు [1]వసిండివి రాలు [2]రంజకం
[3]బిచ్చుగ నీదు [4]దానసలిలాపగలం బడి యా [5]మహాబ్ధితోఁ
జొచ్చి [6]శయానశౌరిహృది [7]జోటిగఁ జిట్టెము గట్ట, దానినే
లచ్చియు, బుచ్చి, పాల్కడలిలక్కమ, యంచువచింత్రు [8]కాకవుల్. ౨

మంత్రులు.—బళి. బళి.

పేరి.—[మరల హాసన్ముఖుఁడై తలయూఁచి యూఁచి విని] దీనికొక సాయింపాక మిస్తా. కయిత్తమంటే యిలా గా? పెతిమనిసికీ తెలిగాల, సాక లోడికి మంగలోడికి కూడా తెలియాల.

కవి.—[స్వగతము] సరి, ఇఁక ధార్త్యము చేసదను. [ప్రకాశము]

క. సలవమడతలకి మలెనే,
యెలిబూడిద సౌదు సున్న మెల్లల మలెనే,
కలువీలమలె, మడేలా,
యెలిగే నీయసము నేల కెలికో కవురా; ౩

మంత్రులు.—బళి! బళి!

పేరి.—[తెఱచిననోరు మూయక, తలయూఁచి యూఁచి విని] సబ్బాస బ్బా బలే! బలే! బాపనయ్యా. అచ్చ్రగనచ్చ్రలు, అచ్చ్రగనచ్చ్రలు, అచ్చ్రగనచ్చ్రలు, కయిూస్సరుడా, యీలాంటి కయిత్తం యింకెవరైయినా శెప్పగ ల్తురా?

కవి.—ఇంతవఱకు లేరు, నేనే మొదటివాఁడను. ఇట్టికవులు సాధారణముగా పుట్టరు.

పేరి.—యప్పుడు? యక్కడ? నాకిట్టాంటికవులే గావాల, యివరంగా శెప్పు.

కవి.—ఇంక ఆఱునూతేండ్లకు వేలుదొరతినములలో కొన్ని తావుల మీఁబోఁటి రసజ్ఞులే బహుళ మగుదురు. వారికై మీఁబోటిరసికులే కవనములు సేయుదురు. మీవలెనే వా రుభయులు చదువుకొన్నవారికన్న తామే మే మని తలఁచువారే.

పేరి.—అయ్యా, కయిూస్సరయ్యా, మేము సదువుకొన్నోళ్లకంటె రుచ్చని మాటలంటట్లు నీ కేలాగ తెల్సిందయ్యా?

---

౨. 1. బంగారములోనుండి. 2. పొడుము. 3. చక్కఁగా. 4. దానోదక నదులయందు. 5. మహాసముద్రములో. 6. (అచ్చట) నిద్రించుచున్న నారాయణుని ఱొమ్మునందు. 7. స్త్రీరూపముగా. 8. పనికిమాలిన కవీశ్వరులు (వ్యాపారులు.)

3. ఎల్లలమలెనే=(గోడలకు వేయునట్టి) తెల్లకలె. ఎలికొక = తెల్లచీర.

కవి.—వరప్రసాదము. మఱి ప్రకృతము. ఆ కవులు మీకుఁదగిన కవనము చేయుదురు. అది అతినీరసముగా నుండును. అందుల కారసజ్ఞులు, ఇందులకు మీ రెట్లో, అట్లే ఆనందసాగరములో మునిఁగి ఊపిరి తిరుగక ఉక్కిరిబిక్కిరియై డొంక తప్పి డింక కొట్టుదురు.

పేరి.—అయితే కయిాస్సరయ్యా, ఒల్లు నీరసంగా వుంటే బాగుండదే, కయిత్తం నీరసంగా వుంటే బాగుంటదా?

కవి.—నీరస మనఁగా నేమి? నీవు ఆనందించురసము నీరసము.

పేరి.—వహ్వా! వహ్వా! నీనోటొచ్చేదంతా కయిత్తమేనయ్యా ♦దెర్ది శేశినావు! నాను అన్నందించేరసంలో అట్లు శేస్తాగుగా కయిత్తం! బలే బలారే! కయిాస్సరయ్యా, నీ కయిత్తానికీ, నీపగ్గెకి, నీదెర్దికీ, నువ్వు శెప్పిన ఆ సుబమైన మాటకీ నీకు అచ్చరనచ్చలు గావయ్యా అచ్చరకో ట్లిచ్చేశినాను, తీస్కెల్లు.

మంత్రులు.—ఇప్పటికి సభ చాలును.

[పులి. అనుమఁడును బహుమానములు, తాంబూలములు, అత్తరు, పన్నీరు, తెచ్చియుందురు. మంత్రులు విద్యావంతుల కిప్పించి సత్కరింతురు. కవి నటిచేత పన్నీటికూజా పెట్టి మంత్రులకును పేరిగానికిని చల్లించును.

[వైణికాదులు సభావందనముచేసి నిష్క్రమి. కవి నమస్కృతు లంది నిష్క్రమి.

జనా.—ఏమిరా పేరిగా, చిలుకకు నేర్పినట్టు నేర్పితిమి. అంతయు సమయమున వ్యర్థము చేసితివిగదా.

పేరి.—సామీ, మీకు దండ మెడతా. నాకిదంతా తెల్దు బాబూ. నాకు సదువొద్దు. సదువుకొన్నోళ్లకంటూ నా నెచ్చేగందా, నన్నెందుకు మా రాజా, సదువు శెప్పి ఫలం శెరుపుతారు?

విద్యా.—పులిగా, అనుమా, వీనిని గొనిపోయివిశ్రమింపుఁడు. [ముగ్గురునిష్క్రమి.

విద్యా.—ఏమి తమ్ముఁడా, దివ్యమైన ప్రహసనము!

జనా.—మన యాంతరంగికులనే వైణికాదివేషముల ధరింపించియుండఁగా పరువు దక్కినదిగాని, ఇతరులకే దర్శన మిప్పించియుండిన ఎంత రసాభాసము! వీని దర్శనమేల! ఆగంతుకులకును ఆశ్రితులకును మనదర్శనములే చాలును.



♦ దెర్ది = ద్వ్యర్థి.

# సప్తమాంకము

స్థలము. 1.—ఢిల్లీ, వలీఖానుని దర్బారు చావడి

[ చెకుముకిశాస్త్రి తురకవేషమున ప్రవేశించియుండఁగను వలీఖాన్ దుస్తు తొడుగుకొనుచు ప్రవేశించును ]

వలీఖాన్.—సలాం సలాం యమధర్మరాజా జోస్యులుభాయిగారికి.

చెకు.—[లేవకయే] ఈ మర్యాదలకు టక్కులకు ఏమి లెండి? కూర్చుండుఁడు.

[వలీఖాన్ కూర్చుండును.

చెకు.—మీరు మోసము చేసిన నేను మోసపోయెదను గాఁబోలు. 'ఢిల్లీ తీసికొనిపోయెదము, సుల్తానువారి దర్శనము చేయించెదము.' అన్నమాటలు ఎవరివో? 'మేము ఖరారు తప్పుతామా?' తప్పరు. నన్ను మీరు వదలినను మిమ్ము నేను వదలలేదు. బ్రహ్మరక్షస్సు వదలదు.

వలీ.—భాయి, నేను బలే హావసరంలో వచ్చినమాట మీకి తెల్సేవుంటుంది.

చెకు.—నే నుండఁగానే మీ మార్క్రా ఖుస్రూఖానుకడకు వచ్చి [హేళనముగా నవ్వుచు] మీప్రతాపము వెడలఁబుచ్చినాఁడు.

వలీ.—హేళనం చేస్తా వేమి భాయి?

చెకు.—చాకలిని పట్టి తెచ్చితివని నిన్నక్కడ లోకమంతయు హేళనము చేయుచున్నారు. అప్పుడే ఖుస్రూఖానునికిఁ గూడ తెలిసినది. నీవు ఓరుఁగంటినుండి తరలఁగానే యుగంధరుఁడు వచ్చి చాకలి నొకని బోధించి రాజువేషమున నీ యడవిదారిలో నిలిపినాఁడు. వాఁడు కావలయుననియే నీకు పట్టుపడినాఁడు. నీ యోగము మానత్యాగమే, వానియోగము రాజభోగమే. నాతో మాటలు పెంపకు.

వలీ.—మతి అక్కడిగతి?

చెకు.—యుద్ధము, ఖుస్రూ పరారి, మీదండు సర్వనాశము. కడమ మీ సర్దార్లు డింకకొట్టినారు.

వలీ.—రాజాకథా యేమి?

చెకు.—రాజా మొదట వచ్చినాఁడు, తర్వాత వచ్చినాఁడు.

వలీ.—తెల్సేలాగ చెప్పుభాయి.

చెక.—రాజు వేటలో చచ్చె'నని నేనొక దొంగజాబు మంత్రులకు చేర్చి అట్లే దేశ మంతట కింవదంతి పుట్టించి కొంత దుఃఖశాంతి చేసికొంటిని. పిమ్మట వారము రోజులకు రాజు వచ్చెను.

వలీ.—మరి మంత్రియుగంధర్ కథా యేమి?

చెక.—ఆయన రాజు వచ్చినవెనుక రామేశ్వరము పోయి అచ్చట మరిడీ జాడ్యమువలన చచ్చినాఁడు.

వలీ.—అల్లా! అల్లా! అల్లా! హాశ్చర్యం! [హర్షముతో ప్రకాశము] ఇంక ఓరంగోలు మాకి ఏక్ లాడూ. అచ్ఛా! ఆయన్ను రామేశ్వరంపోవడం హామాకే వేగుల్ చెప్పినారు. ఆయన సావడం మాదేపుణ్ణెం.

చెక.—మఱి ప్రకృతము.

వలీ.—నాకి యిప్పటికి యోగం చెప్పు భాయి.

చెక.—నిన్ను నేను ప్రేరించితినని బొంకవుగదా? మఱి, ఒక్కొక్క మాట చెప్పఁగానే నిజము నిజ మని పలుక వేని నేను పైని చెప్పను. పూర్వము నీవు లడాయికిఁ గాదని బొంకలేదా? నిన్ను నమ్మరాదు.

వలీ.—నీవు నాకిద్రోఘుం చెయ్యనని ఖరార్ చేస్తే అంతా యఖ్రార్ పడతాక్.

చెక.—ఇప్పు డేల ఖరారు? నేను ఓరుఁగంటిలో నీ డేరాలోనే చేసితిని. చేసిన ఖరారు నేను మరల చేయను.

వలీ.—అట్లైతే వొప్పుకొంటూక్ చెప్పు.

చెక.—ఖుస్రూ వచ్చియున్నాఁడు. నిన్ను దర్శించును. చాకలిని తెచ్చితి వని నీతో పలుకును. సుల్తానుతో చెప్పు నని వెఱచి నీవు వానిని చంపి వేయుదువు. చెప్పుము, చంపఁ దలఁచితి వా లేదా?

వలీ.—జోస్యులు భాయి, నాప్రాణాన్కి నీచేతా పెడుతున్నాను. నేను చాకలికి తెచ్చినమాట ఖుస్రూకి తెల్సిం దని నీవు చెప్పినప్పుడే వాఁడికి సఫాయి చేయుకల్సింది తల్చినాను.

చెక.—నీవు ఈఢిల్లీసింహాసనము నెక్కఁగోరి యున్నావు. నిజము పలుకు.

వలీ.—సా స్తుద్దభాయి, నాప్రాణం నీచేతా వుంది. కోర్తున్నాను.

చెక.—నాకు ఒకఖరారు వ్రాసియిచ్చిన నేగాని, నీకు అది వచ్చునో, రాదో, ఎప్పుడు వచ్చునో, ఎట్లు వచ్చునో, చెప్పను.

వలీ.—చెప్పు, రాశి యిస్తాను.

చెవ.—"నేను నేటికి తొంభై గోజుల రాత్రి సుల్తాను కాగానే నీకి నా చెల్లెల్కి యిచ్చి పెళ్లిచేసి వోరంగోల్ పట్టి ప్రతాపుడికి ఖైదు చేసి ఆ రాజ్యానికి నీకీ పాచ్చా చేస్తాను." అని వ్రాసి నేటితేది వేసి దస్కత్తు చేసి యిమ్ము.

వలీ.—అరే బొమ్మన్కి నీకీ నా చెల్లెల్కి యేలాగ యిచ్చేగిఖాయి?

చెవ.—నేను నీమతములో చేరెదను.

[వలీ వ్రాసి యిచ్చుట నభినయించును.

చెవ.—[పుచ్చుకొని చదువుకొని] మంచిది. ఈ ఖరారులోనే చెప్పితిని.

వలీ.—యేలాగా వస్తుంది?

చెవ.—ఖూనీలు చేసి సంపాదించెదవు.

వలీ.—చెయ్యడాన్కి తయ్యార్ వున్నాను. ఎవర్కి ఎవర్కి?

చెవ.—నీకు విరోధులగు వజీర్ల నందఱను, సుల్తానును గూడ.

వలీ.—అందర్కి చంపడాన్కి తయ్యార్, సుల్తాన్కికూడా చంపడాన్కి తయ్యార్. వీడు తన అన్నా కొమారుడ్కి సిషువుకీ చంపి తఖ్తు యెక్కినవాడే. యిందఱున్ను నాకీ యేలాగ దొరుకుతార్ భాయి?

చెవ.—అందఱును ఆ రాత్రి ఒక యేడలో చేరుదురు! అప్పుడు నీకు దొరకుదురు.

వలీ.—నమ్మడానికి అసాధ్యం వుంది. హాశ్చర్యం వుంది. మఱి యిందుకీ నా ఖుమ్మక్ యేమీ జరూర్ లేదా?

చెవ.—సర్వము యత్నాధీనమే. యత్నము లేక గ్రహములు ఫలము నీయవు. స్వప్నమందుఁ గాని, మనోరథమాత్రమునఁ గాని. జన్మాంతగమునఁ గాని, ఇచ్చును. కావున పూర్ణయత్నము వలయును.

వలీ.—ఆయత్నం యేలాగో చెప్పు. నేనే యత్నం చేస్తే వజీగస్సి వజీ చెయ్య వల్సి వచ్చును. నీవు జోస్యానికి సరిగా ఇది చేయి చెప్తే అదీ చేస్తాను. ఫలం నిశ్చయం.

చెవ.—అవును, అట్లుచేసిన, ఫలం నిశ్చయమే. అవునుగాని 'నాపొట్ట పెరగావాలా నానోరు తియ్య కావాల, నీవే అడ్డు నవిలిపెట్టు నీవే అడ్డు మింగి పెట్టు.' అనుచున్నావే?

వలీ.—భాయి, నీకీ చూడగానే నాకీ ఖాసాబుద్ధి వుండదు. నీవు జోస్యం చెప్తావో వుపాయం చెప్తావో నాకీ తెల్వదు, నేను కబోదీ వుంటాను.

చెవ.—రెండును కలిపి చెప్పెదను. ఆ దినము పగలు మూఁడవజామున సుల్తాను సభకు—[అని పగములో] మంచిది.

ఉ. ఈ [1]మత మీవు పేయు దని యేమి నిజంబు? బడావజీరవై
భూముల సీమలం బొగడు వొందిన [2]మేటివి, నీకుఁ బాదుషా
గామి య దంతగాఁ గొదువ గాదు; పకీరను నే నమీరు గా
కీమెయి నుందునొక్కొ? గిర వి మ్మిటఁ జొచ్చెద నమ్మి నీనుడిన్ ౧

వలీ.—నా చెల్లెలికి యిప్డే నీఘర్కు తీస్కానిపో.

చెన.—విస్తాగము భోజనము చేయునా యేమి? నీ చెల్లెలిని పాచ్ఛా పెండ్లిగా పెండ్లిగూడుదు నేగాని పకీరు పెండ్లిగా పెండ్లియాడను. అందుల కిదిగో, జవాహరీ జామీన్ పుచ్చుకొనియెదను, వినుము.

వలీ.—అచ్ఛా, తయ్యార్, చెప్పు.

చెన.—నన్ను, ముందు సుల్తానుసభకు చేర్పుము. నీ పెద్దకొమారితను సుల్తానునకు, చిన్నకొమారితను నీవిరోధి సేనాపతికిని ఇచ్చెదనని వారికి చెప్పు. దానిని తప్పకుండ అతఁడు కోరునట్లు చేయుపని నాది. నే నేర్పరించిన తొంబదవ దినము నిశ్చితార్థము సుల్తానువారిసభలో చేయుము. ఆయుత్సవముకై వజీర్లను సేనాపతులను కడమగొప్ప యుద్యోగస్థులను అందఱను పిలువుము. అందఱను నేను రప్పించెదను. మూఁడవదినమున గోవావర్తకులు వచ్చి నజరులుంచి సుల్తానును తను యోడలకు సరకులు చూడరమ్మని పిలుతురు. వెలతీర్పరి లేక కొను టెట్లు? మన మడివేలు ప్రతాపుని వెలతీర్ప రప్పింతురు. నజరులకు వాఁడు వేయు వెలలు వర్తకులొప్పి రేని సభయెల్ల ఓడలకుఁ బోవును. కావున, వర్తకులకు,

(తరలము)

నబురుఖర్చు, వజర్లకు న్వేల, సర్వవిక్రయలాభమున్,
బ్రబలమైత్త్రిగ నావలో మనపక్ష మున్కకి లంచమున్,
[1]నిబిడరాశి[2]యొనర్చి యిత్తువు నీవు; వారిని దాన నే
బొబగు మీఱఁగ [3]డక్కఁగొందును, సొంపుగాఁ బని తీర్పుదున్. ౨

వలీ.—ఆ మొత్తం యింతా చెప్తే, యిప్డే నీచేతికి యిచ్చివేస్తాన్.

చెన.—నీ సొత్తంతయు నిచ్చినను చాలదు. నేను పాచ్ఛా అగునప్పుడు ప్రతాపునినగలు ధరించి అతని గుఱ్ఱమునకు పూర్వమది ధరించిననగలు వేసి అతని

౧. 1. ఒప్పుకొన్నపని. 2. గొప్పవాఁడవు. అమీరు = ప్రభువు. ఈమెయిన్ = ఈవిధముగా. గిరవు = కుదువ.

౨. 1. దట్టమైన ప్రోగు. 2. చేసి. 3. వశపఱుచుకొందురు.

యెదుటనే స్వారి చేయవలయును. అందుకై నాకప్పటికి అవసరమగు ఆయు
నట్లుగా, వారి కిపుడు లంచముగా ప్రతాపుని భూషణములును వాని గుఱ్ఱము
భూషణములును అన్నియు నాచేతికి ఇచ్చి వేయుదును. ఇదె నాకు జామీను.

[వలీఖాను తటాలున లోపలికి పోయి, ఒక పెట్టె
తెప్పించి తాళపుచెవితో గూడ ఇచ్చును.

చెన.—[తెఱచి చూచి] సరియే.

వలీ.—రేపు భాయికి సుల్తానువారి దర్శనం.

చెన.—సరి. నేను నడిచెద. నీవు నీపని చూచుకో. సలాము ఢిల్లీ సుల్తాను.

వలీ.—సలాం వోరంగోల్వాచ్చా.

[పెట్టెను తెచ్చినవాకడు పెట్టె నెత్తుకొని చెనమునితోఁ
గూడఁబయటికిఁ బోవును. వలీఖానులోనికి నిష్క్రమించును.

స్థలము 2. ఢిల్లీలో ఒకవీథి

[అంతట ఇద్దఱు తురకజవానులు, ప్రవేశింతురు]

[ఉభయులు పరిక్రమించుచు సంభాషింతురు.

ప్రథ.—అరే అమీనుద్దీన్, యీ దివానా మనకీ యెక్కడరా దొరుకు
తాడు? యిన్నిగల్లీల్ తిరిగినాం, యిప్పటి కింకా పాగ్వడలేదు.

ద్వితీ.—మనం యిది మొదల్ ఈరాత్రి అంతా, వీడ్కి తెలియకుండా వీడి
యెంటా తిరుగుతా వుండవాలా. మనకీ యెంతా ఖష్టం వచ్చిందిరా వీడికోసం?

[నేపథ్యమున]

ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్ ;
మూడే నెల్లాదూ పట్టూకపోతాన్ ;
వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాన్.
గోతిలోపాతించి గోరి కట్టిస్తాన్. [మరల అదే చెప్పును.

చెన.—[ప్రవేశించి] వాఁడుగో, మహానుభావుఁడు వచ్చుచున్నాఁడు.

ప్రథ.—అరే అమీన్, దివానా, అరే దివానా, అమీన్, దివానా వస్తున్నాడు
వుంది, వాడిపాటా యిన్పడ్తుంది. మన్ముయిక్కడే వుందాం.

[నేపథ్యమున]

ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్ మూడే నెల్లాదు పట్టూకపోతాన్.

[మరల అదే చెప్పును.

ప్రథ.—అరే అమీర్జా, వీడు మూడు నెల్లు అరుస్తాడు వింటావా? వీడు గోజ్ లెఖ్కాశప్తాకు లేదు అంటారు.

ద్వితీ.—వీడు మూడు చందుల్నుంచి యిలాగా అరుస్తున్నాడు చెప్తారు: మొదల్ అరుమాసాల్కి పట్టుకపోతాజ అరిచినాడు చెప్తార్?

ప్రథ.—అరె నీకీ యెవ్వర్ చెప్పినార్?

ద్వి.—పహారాజవాన్లు చెప్పుకొంటార్. నేను వింటాజ.

ప్రథ.—అరాజాకి వీడ్కి యేమైన సంభందం వుండునా భాయి? వాడూ తెలంగి, వీడూ తెలంగి.

ద్వితీ.—వీడిది భాత్ వస్తే, 'నివానాభాత్ వల్ల మనకీ యేమి కిఫాయత్? వేరే యేదైనా మంచి ఖమాయిష్ చెప్పండి.' అడుగుతాడు మహారాజా.

[అంతట వెఱ్ఱివాఁడు పెద్దగుంపుతో ప్రవేశించును]

[వెఱ్ఱివాఁడు గుంపును కొట్టును. గుంపు వానిమీఁదఁబడును!

జవానులు.—అరే దివానా! అరే దివానా! బలే తమాష! బలే తమాష! ఏమీ వాడివెంటా గుంపూ! అరే వాడు యెంత గడ్బిడా చేస్తాడూ! మున్ము యిక్కడ వాడికి తెల్వకుండా దొంగా వుండి చూస్తాం. [అని పొంచి చూతురు.

[చెకుముకి వెఱ్ఱివాఁడుకనునట్లుగా వానిక్రోవల పెట్టవానితో నడుచును.

వెఱ్ఱి.—ఢిల్లీ కుల్లాజా... [పొట్లపు విస్తరాకు రస్తాలోదొరకఁగా దానిం గైకొని] నహవ్వా! నాకు జయకాలం జయకాలం. బలీ! ఎటువంటికిరీటం దొరికిందినాకు! [అని దానిని టోపిగా ధరించి] బలారే! దీనితో నేను ఈ భూచక్రమంతాయేలుతా. [అని గిరగిర నృత్యము సేయుచు] ఢిల్లీ కుల్లాజా... [చెకుముకి నిష్క్రమించును.] [నేలఁబడి పొరలుచు, పొరలుదండములు పెట్టి, పకపక తనలో తాను నవ్వుకొని లేచి] నీ నెవరనుకొన్నావు? నేను యోగీశ్వరుణ్ణి, వేదాంతం నేర్పుతా. తురకాణ్ణి, గాడిదను. మనిషిని, గుఱ్ఱాన్ని, కాలభైరవుణ్ణి, గండభేరుండాన్ని, లొట్టిపిట్టను, [త్వర త్వరగా] కాకిని గద్దను కోడిని కొంగను బోడిని మొట్టను పొట్టిని కట్టను. ఏవిద్య నేర్పమన్నా నేర్పుతాను రండి, నాశిష్యులయ్యేవారు నాతోరండి. నాకు కూన్యం పెట్టక ముందు చదువులబరి కూడా చెప్పినాను, చదువు, చదువు.

[అని పిల్లవాండ్రను చావఁగొట్టుట నభినయించును.

ఒకపడుచువాఁడు.—[తనయిరువురు మిత్త్రులతో] వెఱ్ఱివేషాన ఈయన వాస్తవంగా యోగీశ్వరుడే అయినా గావచ్చును. ఇట్టివాళ్లకి బంగారంచేయడం, ఆకాశ

గమనం, పరకాయప్రవేశం, ఈమహిమలుకూడా వుంటాయి. మనం మెల్లిగా యీయన్ని ఆశ్రయించి సత్తయేమైనా వుంటే గ్రహింతాం. మనవు ఈ దేశంలో తల్లీతండ్రీ భయం లేదుగదా రండి.

ఇతరులు ఇరువురు.—మంచిదిరా ఆలాగే చేతాం. మనలో యెవడికి నేర్పినా వాడు కడమ యిద్దరికి నేర్పవలిశింది.

ప్రథ.—ఈయన తన్నినా చంపినా మనం పడదాం. లేకపోతే చెప్పడు.

ఇతరులు ఇరువురు.—సరిసరి.

ముగ్గురును.—[వెఱ్ఱివానితో] స్వామీ, యోగీశ్వరుడా, మేము శిష్యులంగా వుంటాం.

వెఱ్ఱి.—బళీ, అయితే రండి. [అని వారిని చూపఁగొట్టును.

రాయి తీసికొన్నవాడును రాయి ఇచ్చినవాఁడును కడమ వారును—[పకపక పరిహాసించుచు] బలేబలే! చదువు వొంటపడతావుంది! చదువు వొంటపడతావుంది! వాడంతో శ్లవుతారు. యెధవముండకి మొక్కితే తినకిమ్మన్నరుయెవ్వళ్లు ఝాగిల్లమన్నదంట.

వెఱ్ఱి.—ఆ వెధవముండలమాట మీకేమి రండి. వేదాంతం నేర్పుతా.

శిష్యులు.—చిత్తం.

వెఱ్ఱి.—మరి నేర్చుకోండి [అని వికటనృత్యముతోను అభినయముతోను చెప్పును.

అన్నమైతే నేమిరా, మరి సున్నమైతే నేమిరా.

శిష్యులు.—అన్నమైతే ...

వెఱ్ఱి.—అందుచేతే పాడుపొట్టకి అన్నమే వేతామురా.

[శిష్యులు నవ్వుచు, ఒకరినొకరు చూచుకొనుదురు.

వెఱ్ఱి.—[తన్నుచు] దిక్కులు చూస్తారూ? దిక్కులు చూస్తారూ?

[అని జుట్టు పట్టుకొనును.

శిష్య.—లేదు స్వామీ, లేదు, చూడము, చెప్తాము.

వెఱ్ఱి.—[జుట్టు వదలి] చెప్పండి మరి. అందుచేత ...

శిష్య.—[తమలో తాము నవ్వుకొనుచు, కొట్టునేమో అని బెదరిబెదరి వెఱ్ఱివానిని చూచుచు] అందుచేత ...

వెఱ్ఱి.—మేడలైతే నేమిరా, కరగోడలైతే నేమిరా,

అందుచేతా మేడనే యీ బొందిని వేతామురా.

శిష్య.—మేడ ... నేమిరా, [అని గురువువైపు చూతురు.

వెట్టి.—అందుచేతా ...

శిష్య.—[నవ్వుకొనుచు] అందుచేతా ...

వెట్టి —వెట్టి పడితే నేమిరా, మరి తొట్టి పుడితే నేమిరా,
వెట్టి తొట్టి వెంగళప్ప వెట్టివేదాం తామురా.

శిష్య.—[నవ్వుచు] వెట్టి ...

వెట్టి.—నాకుదీన్ని చిన్నప్పుడు వీరబ్రంహం నేర్పినాడు. నేను మీకు నేర్పినా.

ప్రథ.—[ఇతరు లిరువురతో జనాంతికము] యోగీశ్వరుడని నేను మొదటనే చెప్పలేదా?

వెట్టి.—ఢిల్లీ సుల్తాన్ ... ... [అని పరుగు. శిష్యులు కూడ పరుగు.

వెట్టి.—వెర్రివాడికి అన్నిమతాలు ఒకటే, అయినా నాకు ఒకవిధంగా తురకమతం అబ్బింది. అది మీకు బోధచేస్తాను రండి.

శిష్య.—మా కక్కర లేదండి.

వెట్టి.—కక్కరలేదా? కక్కరలేదా? మరి శిష్యుల మని యెందుకు చేరినారు?

శిష్య.—నేర్చుకొంటాం స్వామీ, నేర్చుకొంటాం.

వెట్టి.—[వడిగా నడుచుచు] మాతాతా, తురకాడున్ను ఒక యేట్లోనే మొహం కడుక్కొన్నారు. తురకాడు అద్దరిని, మాతాత యిద్దరిని, మనమంతా ఉద్దరిని, అక్కడ కప్పలు కప్పలుకప్పలు; ఆ మూలాన వాడి తురకమతం [గంతు వేయుచు] కప్పగంతు వేసి మా తాతమీదుగా నాకొచ్చింది. నన్నుంచి మీకు వస్తావుంది. మరి చెప్పుకోండి. లేకపోతే చంపేస్తా. [అని పాడును. ద్రష్టయొకఁడు మోర్సింగు వాయించును.]

హోవూపేడా మీరూ హల్కి కొంటార్.
హోవుపూతీ మీరూ తాగికొంటార్.
హోవు మెక్కా మీకీ మస్సీ తక్కా!
యెబ్బెబ్బె యెబ్బెబ్బె యేమీమతం!

[శిష్యులు నవ్వుదురు.

వెట్టి.—[అతికోపముతో] చెప్పరేమి? చెప్పరేమి? [అని కొట్టును

శిష్య.—స్వామీ, చెప్పుకొంటాం, ఈమాటు చెప్పండి.

వెట్టి.—ఆరే శిషులు, నేను మీకు ఖాజీనిగదా. నా ప్రశ్నలకు జవాబు చెప్పి మీమతం నిలుపుకొంటారా?

శిష్యు.—నిల్పుకొంటాం.

వెఱ్ఱి.—నిలుపుకోకపోతే, నామతంలో కలిసిపోతారుగదా ?

[శిష్యులు మొగాలు చూచుకొందురు.

వెఱ్ఱి.—కలిసిపోతా మనండి. [అని యిద్దఱను చెవులుపట్టుకొని యీడ్చుకొనిపోవుచు] ఢిల్లీ సుల్తాన్ ...

శిష్యు.—కలిసిపోతాం, కలిసిపోతాం.

వెఱ్ఱి.—జందె మెందుకురా పనికొస్తుంది.

ప్రథ.—అది మా గాయత్రి.

వెఱ్ఱి.—మూర్ఖా, వీపుగోక్కోడానికిరా అది పనికొస్తుంది.

ద్వితీ.—ఆడవాళ్లకు దుగదలేదా ?

వెఱ్ఱి.—వాళ్లకుం దేది వాళ్లకుంది, నీకుం దేది నీకుంది. నాతో వాదిస్తావా ? నేను ఖాజీని నీవు ఘాజీవి.

[అని కొట్టును.

శిష్యు.—లేదండి, లేదండి.

వెఱ్ఱి.—మీ మతంలో జుట్టెందుకు ?

ప్రథ.—నరకకూపంనుంచి స్వర్గానికి లేవనెత్తడానికి.

ద్వితీ.—మీ మతంలో గడ్డ మెందుకు ?

వెఱ్ఱి.—చంపేస్తాను నాతో వాదిస్తే. జుట్టెందుకో నేను చెప్తాను విను; పట్టుకొని తన్నడానికి.

[అని పట్టుకొని తన్నును.

తృతీ.—గడ్డ మెందుకో నేనున్ను చెప్తాను; పట్టుకొని ఊగడానికి.

[అని గడ్డము పట్టుకొని ఊఁగును. వెఱ్ఱివాఁడు ఆగ్రహముతో కొట్టఁబోవును. తృతీయుఁడు తప్పించుకొని దాఁటును.

ద్వి. తృ.—చాలునురా మనకీ శిష్యత్వము. ఎన్నడూ నాయన చేతి లెంపకాయ వారిచేతకూడా దెబ్బలెరగము, ఈ వెఱ్ఱిముండాకొడుకుచేత తన్నులగ్రహారాల మేమిరా ? వీ డెవడో యినుముగాడు గాని మనిషి కాడు.

ప్రథ.—కాయసిద్ధి అయిన యోగీశ్వరుడురా, ఈయన దయచేత మనకున్ను కాయసిద్ధి కావచ్చును.

ద్వితీ.—మనకు సద్యః కాయశుద్ధి అవుతూవుంది.

చారులు.—అరే వీడికి నూడడం తమాషాగానే వుంది. వాడికోపం నూడు.

వెఱ్ఱి.—[మహాగ్రహముతో] వెఱ్ఱిముండాకొడుకా ? ఎవఁడా ? నాకు కూన్యం పెడితే నేను యీలాగయినాను. నాకు వెఱ్ఱేమి ? వెఱ్ఱి వాడికి మాటలొస్తాయా ?

నాకు పిల్ల నిస్తే పెళ్లి చేసుకోలేనా? [వంకల్లు గుస్సాగానుచు దుముకుచు] హిహి హిహిహిహిహిహిహి. ఆడవాళ్లోయి ఆడవాళ్లోయి! పెళ్లోయి పెళ్లోయి! పెళ్లామోయి పెళ్లామోయి. దుముకు, ఎగురు. [కోటికడ చేయి పెట్టికొనిచూచును. నా పెళ్లి సన్నాయి. కీకీకీకీ. చూడు నాడోలు. [తొడతాళము వాయించుచు] డాండాండాండాం. [తృతీయశిష్యుని ఉగ్రముగాఁజూచి] నీకళ్లు చూస్తే నీ మనస్సులో నాకు వెఱ్ఱనే ఉంది. నిన్ను చంపేస్తా. ఢిల్లీసుల్తాన్ ... [అని వాని తఱుముకొనిపోవును.

[ఖుస్రూఖాన్ ఆదారిని పోవును.]

చారులు.—[చూచి] అరే ఖుస్రూఖాన్ బహద్దర్! తెలంగీదేశంనుంచి వచ్చినాడు. అదే వలీఖాన్ యింటికి కావాలా పోతాడు.

[ఖుస్రూ నిలిచి వెఱ్ఱివానిని నిదానించి కని వెడలిపోవును.

వెఱ్ఱి.—[తృతీయశిష్యుని చెవిపట్టి లాగి తెచ్చి] ఇక పారిపోవుగదా? ఇక పారిపోవుగదా? [అని చెవి నులిమినట్లు అభినయించుచు] రహస్యం చెప్తా. [అని చెవిలో] నాయనా, ఈ ఖుస్రూగానితోపోయి వృత్తాంతముగని వచ్చి చెప్పుము. [అని చెవి కఱచి, ప్రకాశము] ఇక నిన్ను నా శిష్యులలో చేర్చను పో. నా కెకడ్రఁడ అగపడితే చంపేస్తా.

తృతీ.—[కీ అని యేడ్చుచు] మా అమ్మా నాయనా చేసుకొన్న పుణ్యం. దొంగ వెధవ! రహస్య మని వంక పెట్టి చెవి కరిచేశాడు. [ఆత్మగతము] వాః! ఏమి మా నాయన జాగరూకత! ఏమిప్రతిభ! ఆహా! రాజుకై ఎట్టికష్టములను పాల్పడు చున్నాఁడు!

[అని నిష్క్రమించును.

వెఱ్ఱి.—నాశక్తి యీనాగమ్మకు తెలంనునా? నేను బారువ నిగపకాయలు మంగలంలో వేయించి దంచినా దగ్గను. ఒళ్లంతా గొంగళీ పురుగుల అంగీ తొడిగినా గోక్కోను. గాడిదకంటే ఓండ్రపెడతాను, గడ్డి మేస్తును, గుఱ్ఱానికంటే పరిగెడతాను, గూటాలు పెగలను.

ప్రథ.—[ద్వితీయునితో జనాంతికము] ఇదంతా కాయసిద్ధికి ఫలం. [నిష్క్రమి.

వెఱ్ఱి.—[ప్రథముని జుట్టుపట్టుకొని] ఢిల్లీ సుల్తాన్ ...

[అని నిష్క్రమించును. చారులుకూడ నిష్క్రమింతురు.

స్థలము 3 ఢిల్లీలో మఱియొక వీథి

[వెఱ్ఱివాఁడు శిష్యులు వెనుక చారులు ప్రవేశింతురు]

వెఱ్ఱి.—[ఆత్మగతము] మా అబ్బాయి ఇంకను రాలేదు. కరము వ్యాపృతుఁడై యుండఁబోలును. కానీ, నా ప్రతిభముందఱ ఇతరుల నీతిప్రయోగము ఏపాటి.

ద్వితీ.—నాకు చాలును స్వామీ; దుశ్శాలువ, ౧౧౧జల్లు, ఇప్పించండి.

పెత్తి.—ఇస్తానురా. [అని జుట్టు పట్టుకొని పరుగున ఈడ్చుకొని పోవుచు] ఢిల్లీ సుల్తాన్ ...

ద్వితీ.—[జుట్టు వదలించుకొని] బహుమతి స్వామీ, దుశ్శాలువ.

పెత్తి.—మూర్ఖా, దుః అని సరిగా ఉచ్చరించు, దుః, దుః, దుః, అను.

[అని జుట్టుపట్టుకొని వానితలను కుదలించును.

ద్వితీ.—దుః, దుః, దుః.

పెత్తి.—ఆ విసర్గని వేరే ఉచ్చరించు, మూడుమాట్లు.

ద్వితీ.—విసర్గమును వేరే ఉచ్చరించడ మెరగను స్వామీ.

పెత్తి.—ఎవడ్రా నీకు చదువుచెప్పినవాఁడు? నీకు దుశ్శాలువలో? మట్టి.

ప్రథ.—ఉహ్, ఉహ్, ఉహ్.

పెత్తి.—వాడు విసర్గ నుచ్చరించాడు చూచావా? వాఁడూ నాశిష్యుడంటే, వానికి దుశ్శాలువ, ౧౧౧జల్లు. నీకు పూర్ణానుస్వారమే. [అని వానిని వదలి ప్రథముని జుట్టుపట్టుకొని ఈడ్చుకొని పోవుచు] ఢిల్లీసుల్తాన్... [అని వదలి [illegible] పడినవారికెల్ల] స్వామీ, దండం; స్వామీ, దండం.

[అని దండాలు పెట్టును. వారు నవ్వుదురు.

పెత్తి.—ఈనరమానవుల కందరికి నామీద నే కన్ను. [అని అవతలికి పోవును.

ద్వితీ.—శాలువ స్వామీ. [అని వెంబడించును.

తృతీయుడు.—[ప్రవేశించి] రండిరా, మీకోసం వచ్చాను. ఎంత సేపు ఈ దొమ్మరాట? వస్తారా రారా?

పెత్తి.—[తటాలున వానిగొంతు పట్టుకొని] నాపాటకు బదులుపాట చెప్పకుంటే చంపేస్తా.

తృతీ.—స్వామీ, చెప్తా. స్వామీ చెప్తా. మీకు తగినదే నాకన్నా ఒకటి వచ్చును! చెప్పకోండి మరి. [పెత్తివాఁడు గొంతు వదలును.

తృతీ.—[జనాంతికము] రండిరా ఓరి పాపాత్ములారా, రండి, పారిపోదాం

ప్ర. ద్వి.—[జనాంతికము] రవంతుండరా, శాలువా, ౧౧౧జల్లూ పుచ్చుకొని వస్తాం.

తృతీ.—[జనాంతికము] నాకు కూడావంతు. [ప్రకాశము] చెప్పకోండి స్వామీ. చెప్పకోండి. [ఖండోపదేశముగా శిష్యుఁడు చెప్ప గురువు చెప్పకొనును.

[1]తాటికాయ నీటికాడ నాటినారయా,

[2]తాటిబొంద నీటిలోన మీటినారయా.

కోపగించు తాటికాయ, కొంపమాపు తాటికాయ,

ఘాటలాడు తాటికాయ, మంత్రమాడు తాటికాయ, తాటి.

[3]రాయి గట్టి రప్ప గట్టి, రాంబొందు రాత గొట్టి, తాటి.

తాటికాయ [4]నక్క యింక, తాటిబొంద [5]చేప యింక, తాటి.

[6]వల్లకాటి నల్లసామి చెల్లెల్ల చూచుమండ. తాటి.

శెట్టి.—శేష్! శభాస్! బళి! దివ్యం! అద్భుతం! ఆశ్చర్యం! వహవ్వా! యేమి పాటరా! ఏమిపాటరా! నీకు ౧౧౧ఱ్ల దుశ్శాలువ. అయిపోయిందా ఇంకావుందా?

తృతీ.—ఐంది, బహుమాన మియ్యండి.

[అని ఇతర శిష్యులను వెనుకకు ద్రోచి తాను శెట్టివాని దగ్గఱ ముందు నిలుచును. ఆ శిష్యులు త్రోసికొని ముందునకు వచ్చి నిలుతురు.

శెట్టి.—నాపాట యిం కొకటి చెప్పుకొంటే యిస్తా.

ప్ర. ద్వి.—చెప్పుకొంటాం.

తృతీ.—[ఆర్తితో] మీకు కూడా వెఱ్ఱి పట్టిందంట్రా? రా రేమిరా?

శెట్టి.—ఏమిరా, చెప్పుకొంటావా, దుశ్శాలువు పొగొట్టుకొంటావా?

తృతీ.—చెప్పండి గురోజీ. [గురుశిష్యులు. యథాపూర్వము.

తాటికాయ గోతినుండి తవ్వి వేయరా,

తాటిబొంద నీటినుండి దాటి యెత్తరా.

తాటికాయ నక్క గాదు, తాటిబొంద చేప గాదు,

తాడు లేక కట్ట రాదు. తగులఁగొట్ట కుండరాదు, తాటి.

రాయి విప్పి రప్ప విప్పి, [7]రావనక్క రాత గుప్పి. తాటి.

తాటిబొంద తాటికాయ, తాచికట్ట దయ్య మౌను, తాటి.

వల్లకాటి నల్లసామి చెల్లెల్ల తూగుమండ, తాటి.

---

1. ఖుస్రూ తలకాయ. 2. ఖుస్రూ మొండెము. 3. రాయి రప్ప కట్టుట మొండెము నీట తేలకుండుటకు. 4. అతలను నక్క భక్షించును. 5. మొండెమును చేపలు తినును. 6. యమున.

7. పోలీసు జవానులకు లంచము లిచ్చి.

దుంప అడి గీతేని దురభాస లాడేవు,
నిన్ను నక్కలు గరవ నిరయాల గురవా. నిరయాలగురవా.
బళిబళీ! మీ తాత బల్లెంబు శేపట్టి,
పుల్లావ తూటుగా పొడిచేశి నాడోయ్. పొడిచేశినాడోయ్.
యూదవుడి గోవులూ మాదవుడు గాయగా,
మాదవుడు మచ్చావ తారమై నాడోయ్. తారమైనాడోయ్.
యెద్దుచ్చ పొటాన్యంగ యేరులై పారంగ,
వుంకించి వుంకించి దాటేశి నాడోయ్. దాటేశినాడోయ్.

[పిరావేశముతో] ఢిల్లీసుల్తాన్ ...

చాగులు.—ఈ అద్మికి యిప్పటికి ఖానా నహి. మనం ఎక్ దో రెండు తూగ్లు తీన్నాం. మూడో నూరికి వాకలి వుంది. వీడు యేలాగ బతుకుతాడు!

ప్రథ.—ఆకే వీడూ జమునాకిపోతాడు. బొమ్మర్ణానమాజ్ చేస్తాడూ. చండవాలా.

స్థలము 4. యమునకడ శ్మశానము

వెఱ్ఱి.—[కుండ పెంకులో ఎసరు పెట్టి, రాలతో ప్రొయ్యిచేసి ఎసరెక్కించి] ఈ కాష్టంలోది యీకొరివి, యీ కాష్టంలోది యీకొరివి. [అని ఒకటిరెండు చితల నుండి కొఱవులు తెచ్చి ప్రొయ్యిలోపెట్టి మంట వేసి, ప్రొయ్యికడ కూర్చుండి] ఢిల్లీ సుల్తాన్... ఇదేమి! యీదయ్యాలు నన్ను చుట్టుకొన్నవి! నేను వండుకొంటూవున్న యీరవంత అన్నము, వీటికి గావాలట. [ఒకవైపు చూచి] ఓయి వెంగళప్పా, ఎప్పుడు చచ్చినావో మరచి నన్నడుగుతా వేమి? నీప్రాణం పోయినప్పుడే నీవు చచ్చినావు. పొండి మీరంతా. మీతస్సాగొయ్యా! పోరుగా? ఉండండి మిమ్మన్ని ఉచ్చాటన చేస్తా. ఢిల్లీ సుల్తానును పిలిపించి మిమ్మన్ని గోరీలో పెట్టిస్తా. [అని ఎసటిలో బియ్యముపోసి] ఢిల్లీ సుల్తాన్...

ద్వితీ.—భాయి, వాడు ఖానాకి సున్నుశోశి వండుతాడు చూడు.

ప్రథ.—సున్ను కాదు, బియ్యము.

వెఱ్ఱి.—వీరడికి రాగడికి...[ఒకకొఱవి చేతఁగొని] ఈకల్లకాటికి నేను చక్రవర్తిని. చూడండి చక్రం త్రిప్పుతాను. [అని బాణా త్రిప్పిత్రిప్పి కూర్చుండి,

*ఆవులింత సూచించి

[ఆత్మగతము] ఏసాఖ్య మెఱుఁగని నాకు ఆవులింత యేమి? ఎటుప్రక్కను నరుఁ డెవఁడు నాకంటి కగపడఁడు. ఈ చెట్లమీఁద దాఁగి చారు లెవరో నన్ను పరికించుచున్నారు. కాని, వారికంట మిరియపుంబొడుము చల్లెదను. [ప్రకాశము] వింతలేని యావులింత వుండదు. గుడగుడశబ్దం కుండకు నష్టం [అని బాణాకోలతో కుండ పగులఁగొట్టి, ఆ పెంకులు మెదుకులు చితులమీఁద చల్లి] ఢిల్లీ సుల్తాన్... [అని అఱచుచు తరలును.]

చారులు.—అల్లా అల్లా అల్లా అల్లా! అరే వీడు దివానా నిశ్చయం. [అని దుమికి] మన మెందుకు వీడితో పావడంకే పోదాం రారా.

ప్రథ.—ఖానాగద్దువాడు దివానా కాకపోతే నీవూ నేను దివానాకీ భాయి నేను రేపు యీ తమాష్ సుల్తాన్ వారిదర్బారులో యింకా పట్టం అంతా చెప్తాన్.

ద్వితీ.—నేను మా ఖైదీమహారాజాకి చెప్తాన్, ఆయనిక్కా వఖ్యాటు నవ్వించి ఆ నవ్వు మొఘం సూస్తే నాకీ కోటివరహాల్ యినాంగా వుంటుంది.

చారులు.—[పోవుచు హేళనముగా] అరే దివానాసాబ్, సలాం నీకీ.

పెద్ది.—హాహా! తురకయ్యాలుకూడా నా వెంటబడడమే నా? బేతాళగ్ణాయి గుండె పగలతంతా [అని చెతియొక తన్ను తన్ని] మీయబ్బసైతానుతో చెప్పకోండి.

ప్రథ.—అరే, నాడొక్కా పగిలింది, నేను కదలలేకున్నాను భాయి.

ద్వితీ.—అరే బాబూ, నాతుంటీ విరిగింది. నేను మెదలలేకున్నాను. క్యా కర్నా? మళ్లీ వాడు తన్నకముందే పోదాంరా. [ఇరువురు నిష్క్రమింతురు.

పెద్ది.—[ఆత్మగతము] దివానాయెవరో, మూడుమాసాలకు తెలియును లెండి ముండలారా! [ప్రకాశము] నేను మాత్రము మేలుకోవడ మేమి? ఈ పట్టణమంతా నిద్ర పోవడ మేమి? నేనేమి వీళ్లకి కావల్యాలునా? ఒక ప్రాణి నైనా నిద్ర పోనిష్యను. ఇదుగో ఊళ్ళో ప్రవేశిస్తున్నాను. ఢిల్లీ సుల్తాన్ ... [అని నిష్క్రమించును.

---

*ఇంకొకరు దగ్గఱలేక ఆవులింత రాదు గావున, ఆవులింతవలన సమీపమున నెవరో ఉన్నారని యుగంధరుఁడు కనిపట్టినాఁ డని యెఱుంగవలయు.

# అష్టమాంకము

స్థలము 1. ఢిల్లీ, కోటలో సుల్తాన్ దర్బార్

[సుల్తాన్ పలువురు వజీర్లును, సేనాపతులును, ఉపవిష్టులై ప్రవేశింతురు. యథావిభవము పరివారము కృపాణపాణి.]

సుల్తాన్.—వలీఖాన్ బహద్దర్, నీవు మాకి యీరోజ్ నిక్షా చెప్తావు. ఆ తెలంగి దివానా మాకి యీరోజు పక్కడేవు చెప్తాడు. వాడు దివానా మనకి నిశ్చయం ఐందికదా. తర్వాత మల్లీ యేమైనా దర్యాప్తు చేసినావా?

వలీ.—రోజ్ రోజ్ దర్యాప్తు చేస్తూనే వున్నాను, బందగానెఅలీ. వాడు అలాగే పట్టుకపోతాన్ అరుస్తూ తిరుగుతాడు. అప్పుడే హుజూర్ శెలవు చెయ్య లేదా, 'మనమూ మేలొంటే వాడూ దివానా, వాడూ మేలోంటే మనమూ దివానా!' అని.

సు.—వలీసాహేబ్, నీవు తెలంగీ రాజాకి తెచ్చినావు షంతోషం. యీ పారి ఖట్కం వోంద్రం రాజాకీ తెస్తావా?

వలీ.—హుజూర్ కరాచ్చం వుంటే, యిప్పుడు తెస్తాన్.

సు.—మాగులాం ఖుస్రూ తెలంగీదేషం లడాయిలో మర్గయా కావడం మాకి చాలా హోయాషం వుంది.

వలీ.—[వణంకుచు] అల్లా చేసిందానికీ యేమీ చేస్తాం.

ప్రతీహారి.—[ప్రవేశించి] తఫావద్ బాఅదబ్, బడా బడా బకాల్ చాలా దూగం ఠోస్తానుంచి దర్శణానికి వచ్చివున్నారు.

సు.—బడా బడా బకాల్ యేలాగా తెల్సింది?

ప్రతీ.—యింతగొప్ప నజరానా ఇంతకి కితం ఎంత బడా అద్మి యెంత బడా సుల్తాన్వారికీ కూడా తెచ్చినాడు నహి.

సు.—సెలవు.

ప్రతీ.—హుజూర్ ఆజ్ఞ. [అని పోయి వర్తకులను గొనివచ్చి] వారేసుల్తాన్ వారు, మొకాళ్మే నిల్చి సలాం కరో. [అని నిష్క్రమించును.

[వర్తకులు ఖుర్నీష్ సలాము చేయుదురు, మోకాళ్లమీఁద నే దగ్గఱకుపోయి సలాముతో నజరుపళ్లెమునుంతురు. ఒక జవాను దానిని సుల్తానుముందఱ పెట్టును.

సు.—[చూచి యాశ్చర్యపడుచు] ఏమి యీయద్భుతము! మా చాపుకిష్తె ద్ చేస్తున్నవి. ఇట్యంటివాట్కి అల్లా చెయ్యగలడాకీక న్నాకీ మెకంవస్తుంది!హాబ్బా! హాబ్బా! [అని కన్నులు మూసికొని, తెఱచి, తలయెత్తి, కని] కూర్చోండి వర్తకులూ, కూర్చోండి

[వర్తకులు కూర్చుందురు.

సు.—[పళ్లెమునుండి ఒక మరకతమయూరమును ఎత్తి] చూడండి వజీర్సాహేబులు చూడండి. ఇదేమి అంతా వక్కి పచ్చ చెక్కినారా? పచ్చాంతరం, పచ్చాకి పచ్చా టాకుబందీ చేసినారా? వా! యిది కోడిపుంజూ అంతా వుంది!

వర్త.—జగత్ప్రభువుసన్నిధానములో మానజరులను మేమే ఎట్లువర్ణింతుము?

సు.—పర్వాలేదు ఉడావర్తకులూ, మాకీ షులభంగా మాలుం కావడానికి చెప్పండి.

వర్త.—జగత్ప్రభువారి యాస్థానములో వజీర్సాహేబులున్నారు, సాహుకార్ సాహేబు లున్నారు, సౌదాగర్సాహేబు లున్నారు: మానోట చెప్పించుట కటాక్షము కాదు.

సు.—వలీఖాఁ బహద్దర్, నీవు చెప్పగలవా? [అని నెమలిని చేతి కిచ్చును.

వలీ.—[పుచ్చుకొని చూచి] బందగానే ఆలీ, ఇది వక్టి మాణి.

సు.—[మరలఁగొని] అన్ని వరణమ్లు వున్నవి, హాతుకాలు అగుపడవు! ఆ! ఆ! హాతుకాలు వుందిదానికి హాతుకాలు లేదూ చూపి మాకి మోషంచేస్తారూ వర్తకులూ?

వర్త.—[ఆత్మగతము] ఏమి పఠాణీవానియుక్తి! కోమటిబిడ్డల మని యెఱుఁగఁడు గాఁబోలు. [ప్రకాశము] ఇన్ని సంస్థానములు మేము తిరుగుచున్నాము, మోసములు చేసిన మాకు వ్యాపారము జరుగునా? మిమ్ము వెదకుకొని నన్నూఱుకామడ వచ్చి నజరుంచిన మోసమా?

సు.—[నవ్వి] మోషం అంటే మేము చమత్కారం తల్చినాం వర్తకులూ, మీరు దానికి వేరే తల్చినారు. మనం స్నేహితులు అయినాం మీకి; చెప్పండి, మా వజీరుసాహేబుమాట షరియేనా?

వర్త.—చెప్పకున్న తమకు కోపము వచ్చును. వజీర్లవారిమాట సరియే. ఇదంతయు ఒక పేరాయి. దానిని ఇట్లు చెక్కినారు, ఆయావర్ణములకు ఆయా మణులు తాపించినారు. దీనిని తయ్యారుచేయుటకు పది సంవత్సరములు పట్టినవి.

సు.—మరి వర్తకులూ, స్నేహితులూ, వీటికి ఖరీదు ఎంతెంత వుంటుంది, చెప్పండి కోర్తాము.

వర్త.—భూలోక దేవేంద్రా, మన్నింపవలయును. మా నజరునకు ఖరీదు మానోట రాదు.

సు.—మీనోటా రాదూ నిశ్చయం?

వర్త.—రాదు నిశ్చయము,

సు.—స్నేహం చూచినారు లేదు.

వర్త.—చూడకపోయిన, అప్పుడే చెప్పియుందుము.

సు.—వజీర్సాహేబులు, మీకీ యీలోకం ఖమాయిష్ అంతా తెల్సును. వీటికి ఖిమ్మత్ చెప్పండి. మనకీ వర్తకులూ ఇంతగౌరవం చేశినారు తెల్వవాలా కదా.

వజీరు.—తమసన్నిధిలో దర్బార్లో వుంటాం మాకీ తెల్వదు. దూరం వుంటారూ సాహుకార్లకీ తెల్వనే తెల్వదు. మరీదూరం పోతారు సౌదాగర్లు, వారికి తెల్వనే తెల్వనే తెల్వదు. యెక్కడా తెల్వంది సర్కార్ దర్బార్లో తెల్వవాలా, యిక్డా తెల్వంది యీ భూలోకంలో మరియెక్డా తెల్వదు.

సు.—[జనాంతికము వలీఖానుతో] వీళ్లనోటనే టక్కుచేశి చెప్పిస్తాఁ చూడు. [ప్రకాశము] మంచిది వర్తకులూ, మీరు వచ్చినపనికి చెప్పండి.

వర్త.—మేము ఓడలలో ఇట్టి విచిత్ర వస్తువులను అనంతముగా తెచ్చియున్నాము. తమరు వానిని చిత్తగింతు గని విన్నపము,

సు.—మీరు యేదేశం నుండి వచ్చినార్?

వర్త.—మేము పడమటిసముద్రపు రేవు గోవానుండి వచ్చినారము.

సు.—ఇంతదూరం మీసరుక్కు మాకి చూపడానికి వచ్చినార్?

వర్త.—అందుకోసమే వచ్చినారము.

సు.—ఎన్ని వాడలు?

వర్త.—నాల్గు ఓడలు.

సు.—మీకి దారీ యేది?

వర్త.—

క. గోవాపురియు, సముద్రము,
రావణలంకయును, సాగరంబును, హుగ్లీ,
దేవనది, యమున, [1] వైభవ
[2] శేవధి ఢిల్లీపురీశుశ్రీసన్నిధియున్, ౧

సు.—మనము మీ సరకులు కొనకుంటే, యీ ప్రయాణ మంతా మిగి లుగ్గాక గదా?

వర్త.—జగత్ప్రభువునకు తెలియని దేమున్నది?

సు.—ఇంత వింత నజరానాలో యింత పెద్ద సౌదాగర్లు అద్భుతం సరుకులు తెస్తే అవి పుచ్చుకోకపోవడం మనకి నామోషీ నహీఁ వజీర్సాహెబ్ వాఁర్లు?

వజీ.—తప్పకుండా పుచ్చుకోవాలా.

కడమ వజీర్లు.—సర్కార్ చెప్పినదే.

సు.—మరి వర్తకులూ, మీ సరకులు తెప్పించండి, మేము మాకి కావలసినవి పుచ్చుకొంటాం.

వర్త.—ఇక్కడికి తెచ్చుట అసాధ్యము.

చ. బరువులు నాల్గునావలఁ బట్టక యున్నవి; యన్ని క్రొత్తలే:
తిరముగ వీని మా కెగుమతింపఁగ నయ్యెను రెండు మాసముల్,
ఉరుకృప మీర తెల్లరలయోడలకు న్విజయంబు సేసి, మా
సరకులు చిత్తగింతు రని చాలఁగ వేఁడెద మోజగత్ప్రభూ. ౨

సు.—ఏమి వజీర్సాహెబులు మీ అభిప్రాయం?

ఆ వజీరు.—నజరువస్తువులే యింత అద్భుతం వున్నవే, సరకులు మరీ అద్భుతం వుండును, అవశ్యం పోయి చూడడం సరి అభిప్రాయం?

కడమ వజీరులు.—అచ్ఛా! అచ్ఛా!

సు.—అయితే వర్తకులూ మీరు ఈ వస్తువులకీ ఖరీదులు చెప్తే మనము మీ వాడలకి వస్తాం, సరుకులు పుచ్చుకొంటాం.

వర్త.—[స్వగతము] అహాహా! ఏమి యీతనియుక్తి? [ప్రకాశము] మేము శాశ్వతముగా మీకు వర్తకులముగా నుండఁగోరుచు, మా కోటలమీఁదనే విలువ

---

౧. 1. ఐశ్వర్య. 2. నిధి.

పరిష్కరించుకొనుట వ్యాపారధర్మములో మాకు అపకీర్తికి కారణము, పిమ్మట సందేహముల కాస్పదము. కావున ఆ సరకులకైనను వెలలు తీర్చుటకు తమకు ఆవిద్య తెలిసినవారు కావలయును. అందుకై యెవరిని రప్పింతురో వారివలననే యీనజరు వస్తువులకుఁ గూడ వెలలు తెలిసికొనుఁడు. ఏలినవారు విచారించి అట్టివారిని రప్పించిన ఉభయులకు తృప్తి యగును.

క. ఢిల్లీ ఢిల్లీ యనుచున్
ముల్లోకములందు [1]డవిణ మ్రోఁగెడు నఁట! యా
ఢిల్లీలో వెలతీర్పరి
కల్ల యయిన నింక నెందుఁ గలుగు ధరిత్రిన్!

సు.—[ఆత్మగతము] అరే! వీళ్లు నావల్ల మోసంపోరు. మరి యేమిచేస్తాం? [ప్రకాశము] వర్తకులూ, మీరు ఇంతకిముందు మాసంస్థానానికి యెప్పుడైనా వచ్చినారా? అప్పుడు ఖరీదులు ఏలాగ నిశ్చయించుకొన్నారు?

వర్త.—ఇంతకు పూర్వము మేము ఈ సంస్థానమునకు రాలేదు.

సు.—మేము తప్పితే యీ దేశంలో మీ సరుకులు ఎవర్ కొంటారు?

వర్త.— (స్రగ్ధర)

ఏ రేకోస్తావి తేనిం, డెటులు తెలియనిం, డెంత [1]మూల్యంబుగానిం,
డోరంగోల్పాదుషావా రొకరె [2]విలుతు రత్యున్నతశ్రీసమృద్ధిన్.
వారి న్దర్శింపనే యీ[3]వరమణినజరుల్ వస్తువుల్ గూర్చ నయ్యెన్;
వారున్న న్వేఱుచోట న్పదమిడుదుమె దైవంబు హా! యోర్వదాయెన్!

సు.—అంతధనం వుందా వారికి?

వర్త.—అడ్డ మేమి?

సు.—వారికి ఖరీదులు ఎవరు తీర్చడం?

వర్త.—వారే అందరకు తీర్తురు. ఆ విద్యలో వారు మహానిపుణులు, వారు చేసిన వెలలకు మేము బదులు చెప్పుట లేదు.

సు.—మరియిప్పుడు మీరు ఈ సంస్థానానికి రావడానికి వారేమైనార్?

3. 1. చర్మవాద్యవిశేషము.

4. ఏరు ఏకోస్తావి తేనిండు=ఎవరు ఏకోస్తాసరకులు తెచ్చినను. 1. వెల. 2. కొనుదురు. 3. మేలురత్నముల కానుకలు.

వర్త.—మా దురదృష్టము చేత, ఆ మహారాజు తమసుగ్గాగళ్లోడి యుద్ధములో స్వర్గస్థులైనారని మాయడితిదారులు మాకు తెలిపినారు. దేశమంతట అదే కింవదంతి. అంతట మేము వంశపరంపరగా నున్న యీవర్తకము మానలేక యిటుకు తమ దర్శనమునకు వచ్చితిమి.

సు.—[జనాంతికము] ఏమి వలీఖాను, మనవేగులు తెలంగి రాజాకి మగ్గయా చెప్తారు, వీళ్లుకూడా మగ్గయా చెప్తారు, మనం అతనికి ఊరేగింపుచేసి ఖైదులో వుంచినాం ?

వలీ.—[జనాంతికము] ఆ బడాలడాయిలో రాజా ఏకాకి మనదండు దుంరి చంపిచంపి మనచేతులో పడ్డాడు. మరి అతనివాళ్లకి అగపడలేదూ, వాళ్లు చచ్చినాడు తలచినారు.

సు.—[జనాంతికము] మరి యితనిగతి వాళ్లు విచారించుకోలేదా ?

వలీ.—[జనాంతికము] ఎవడిప్రాణం వాడు విచారించుకొని పారిపోయినాడు, మరి మంత్రులు, ఫౌజుదార్లు, రాజావున్నాడు తెల్సుకుంటే, రాజాకి విడిపించుకోవాల; అసాధ్యం పని. అందులో తాము చావడం రాజా చచ్చిపోయినాడు చెప్తే రాజ్యం తాము హరించవచ్చును. అందుచేత రాజా చచ్చిపోయినాడు పుఖార్ వాళ్లు కొంచెం వున్నది కొండంత చేశినారు వుంటుంది.

సు.—[ఆత్మగతము]అచ్ఛాఅచ్ఛా! [ప్రకాశము] వర్తకులు, రాజా మగ్గయా అయితే, ఇప్పుడు సంస్థానానికి మీసర్కారు యుగంధర్మంత్రి కానరాదా !

వర్త.—వారన్న మాట లోపమేమి? వారు రామేశ్వరములో మరిడీజాడ్యము వలన స్వర్గస్థులైనారని మాయడితిదార్లు వ్రాసినారు. లోకమంతయు నదే కింవదంతి.

వలీ.—[జనాంతికము] మనవేగులు కూడా అలాగే చెప్పినారుగదా ?

సు.—[స్వగతము] అచ్ఛా! అచ్ఛా! [ప్రకాశము వర్తకులతో] వారికి మీకీ చాలా స్నేహం పరిచయం వుంటుందా ?

వర్త.—మాయన్నగారు ఇరువది సంవత్సరముల క్రిందట వారిని స్వయముగా దర్శనము చేసికొన్నారు. అదిమొదలు, మాయడితిదారులే వారితో మా వర్తకమంతయు జరుపుచుండిరి. అట్లే ఇప్పుడు తమకటాక్షము మాయందుంచగలిగిన, మేము ఇచ్చట గొప్ప సాహుకారు లెవరిసైన తమ సంస్థానములోసము అడితి యేర్పఱుచుకొని పోయెదము.

సు.—[జనాంతికము] వలీర్సాహేబులు, మనము పెర్తాపరాజాకి యిక్కడికి తెప్పించి ఖరీదులు చెప్పింతామా ?

వజీర్లు.—అదే సర్కార్కు చెప్పవాలావుంటాం.

వలీ.—[ఆత్మగతము] చాకలి వెల యేలాగా వేస్తాడు? రాజాకాదు మహా ల్వాలా తెలిస్తే నా తలకీ వస్తుంది. ఈ వర్తకులు రాజాకి తెలుసుకొంటారుభయం చెప్పడానికీ లేదు, సుల్తాను తెప్పించకమానడు. నాగతి గాభరావుంది. [చింతించి] అయినా యేమి భయం? యమధర్మరాజు సహాయం వుంది.

సు.—[జనాంతికము] ఏమి వలీఖాను బహద్దర్, నీ మనస్ తెల్వలేదు?

వలీ.—[వణఁకుచు విలత్తుఁడై] రచ్చించవచ్చును నా నమస్.

సు.—[జనాంతికము] వజీరాలీ, నీవు పోయి ఆ తెలంగిరాజాఖైదీకి మన వాడు సౌదాగర్ వేషంవేసి తీస్కోనిరా. [నవ్వుచు] ఆయనదాడీ యీఅరు చందుర్ది మనకీ యిప్పుడు పనికీ వస్తుంది.

వజీ.—సర్కార్ అజ్ఞ. [అని నిష్క్రమించును.

సు.—మంచిది గోవావర్తకులూ, మా రాజ్యంలో మీసరుకులకీ ఖిమ్మత్ చెప్పేవారు లేరు మీరు తల్వవద్దు. మీమాటమీద యిప్పుడు రాచేస్తాం. మరి వారి నిఘా ఖరార్ అవునో కాదో మీకీ యేలాగ దాఖలా?

వర్తు.—ఈ నజరువస్తువులకు వారు వేయుచెలలను బట్టి తెలిసికోఁగలము.

సు.—వారు చాలా గొప్పవారు. మనమంతా వారికీ తాజీం చెయ్యవాలా. వారు వఖ్మాటు మాకీ కావల్సి నూరుకోట్లు వరహాలు అప్పయిచ్చి మల్లీ మేము గెుంత బతిమాలినా పుచ్చుకొన్నారు లేదు. వారికీ మాకీ భాయిభాయి స్నేహం మర్యాద. చూడండి మీ పెర్తాపరాజాకి వారికి నిఘాతై ఫార్.

వర్త.—జగత్ప్రభువు చిత్తము,

[అంతట ప్రతాపరుద్రమహారాజు తురకసౌదాగరు వేషమున వజీరాలితో ప్రవేశించును.]

[సభ అంతయు లేచును,

సు.—[రాజు చేయిపట్టుకొని] సలాం సలాం. ఇక్డ ఇక్డ భాయి.

[అని తన ప్రక్కను కూర్చుండఁ బెట్టును. రాజు సముకాలమందే సలాముచెప్పి కూర్చుండును.

సు.—సౌదాగర్ సాహెబ్, మీకి శ్రమ యిచ్చినాం. కారణం యీ సౌదాగర్లు. వీరు యీ నజర్లు తెచ్చినార్. ఖరీదులు చెప్పను అంటార్. తమరు వీటికి ఖరీదు చెప్పి మన పరువునిల్పవాలా. యిందుచేత తమ దర్శనం అయినది సంతోషంగదా,

రాజు.—[ఆ వస్తువులను పరీక్షించుచున్నట్లుగాఁ జూచుచు ఆత్మగతము] అహో యౌగంధరులవారి మహిమ! ఈ వస్తువులు నాయింటిపురములోనివే, వీరు నా వర్తకులే. మాకు ఈదినమే ప్రయాణనుమూహూర్తము. [ప్రకాశము] భోత్ అచ్ఛా. వీరివల్ల తమ దర్శనం లాభం. యీ కారణంగా వీరికీ మాస్నేహం వుంది. వారియిప్పుడు వీరికి మేము పరీచ్ఛా చేస్తాం, వీరు మాకీ పరీచ్ఛా చేస్తారు. ఒకరి ఖరార్ ఒకరికి తెలుస్తుంది ఛణంలో [సుల్తాను రాజుచేతికి నెమలి నందించును.

రాజు.—[నెమలిని త్రిప్పిత్రిప్పి చూచి, లెక్కలు వేసికొనుట నభినయించి] సుల్తానుభాయి ఈ నెమిలి ఖుమార్ రెండుకోట్లు, యాభై లక్షల్ వరహాల్. కోట్లు పచ్చఖరీదు, యిరువైయైదు లక్షలు తలిమ్మాళ్ళ రాళ్లు, యిరువైయైదు లక్షలు కూల్యి ఏమి చెప్తారు సౌదాగర్లు?

వర్త.—[ఆశ్చర్యముతో] అన్నిటికి చెప్పి కానిండు.

రాజు.—అదీ కాదు. సరియైతే పైన చెప్తాం. లేకపోతే యెందుక్కు చెప్తం?

వలీ.—[ఆత్మగతము] క్యా రే. ఇతడు ఆకుపెల్లు బంటి వున్నా ధీధీప్యమానం వున్నాడు. మంచి తెల్విలో మాట్లాడుతాడు, మహాజ్ఞీకాడు తోస్తుంది. [విమర్శముతో] లేక, మంత్రి యౌగంధర్ అట్యాంటి తెల్విగల చాకలికి సంపాదించి వుండునా మాకీ మోసం చెయ్యడానికి?

వర్త.—తమరు చెప్పినది సరి కాకుండునా? మాకు ఆశ్చర్యము కలుగుచున్నది, మనవి చేసెదము, అన్నిటికి సెలవిండు.

రాజు.—మంచిది. ఈ వజ్రం ఖరీదు [లెక్క నభినయించి] యిరువైయైదు కోట్లు, పని సహా. ఈ పద్మం [మరల లెక్క నభినయించి] పదిహేనుకోట్లు. ఈ తామ్రఖమ్మం పదికోట్లు, అంతా పని సహా. ఏమి మీ ఆశ్చర్యం?

వర్త.—జగత్ప్రభూ, వీరు సాక్షాత్ప్రతాపరుద్రులవారే! స్వర్గస్థు లగుట అబద్ధము!

సు.—[సవిస్మయము, ఆత్మగతము] క్యారే! కనిపెట్టివేశివారే!

వలీ.—[ఆశ్చర్యముతో] ఖుదా, జోస్యులుభాయి, చాకలీ చెప్తారు! వీళ్లు రాజా చెప్తారు! క్యారే ఇది!

వర్త.—వీరి దేహములో పరకాయ ప్రవేశము చేసినారని మాకు తోఁచుచున్నది. మంత్రి యౌగంధరులవారికి అట్టిశక్తులు కలవని మేము వినియున్నాము. ఈ పెలబు ఆ మహారాజే చేసినారని చెప్పవచ్చును.

వలీ,—[హర్షముతో ఆత్మగతము] బలే బలే! వాళ్లమాట అది కాదు! మాకీ యమధర్మరాజా సహాయం నిజం నిజం.

సు.—[ఆత్మగతము] వాళ్లు నిజ్జీ చెప్తే మేము మరి నిజ్జీ తెలుసుకొన్నాం. [ప్రకాశము] ఖరీదులు అంత సరిగా వున్నవా?

వర్త.—ఉన్నవి.

సు.—వీరిఖరాప్రకారము తిర్గ లేక ఒప్పుకుంటూరా?

వర్త.—ఒప్పుకొనియెదము.

వలీ.—[ఆత్మగతము] బలే! యమధర్మరాజా సహాయం! బలే! యమధర్మరాజా సహాయం!

సు.—ఒప్పుకోకపోతే?

వర్త.—మమ్మందఱను శిరచ్ఛేదము చేయింపుఁడు.

సు.—ఇదే షరత్? నిశ్చయం?

వర్త.—ఇదే షరత్, నిశ్చయము.

సు.—అచ్చా! అచ్చా! [జనాంతికము] మహారాజాభాయి, వీళ్ల సరుకులు అన్నిటికి సున్నహమానం ఖరీదులు వెయ్యండి. మేము షరత్ప్రకారం పుచ్చుకొంటాం. ఒప్పుకోకపోతే శిరచ్ఛేధం పుచ్చుకొంటాం. మీకి యీ ప్శ్నహానికి వోరం గోల్కు వదిలివేస్తాం. మరి తిమరు బందిఖానాకి రావద్దు. జవాబు చెప్పండి భాయి.

రాజా.—[ఆత్మగతము] ఎంత నిర్భాగ్యుఁడు వీఁడు! అన్నకుమారుని శిశువును చంపి రాజ్యము హరించినవానికి ఈ చింత యెంతపాటి! [జనాంతికము] సుల్తాన్ భాయికి జవాబ్ పదిమాటలు యెందుకు? మరి యిక్కడికి రాం.

సు.—అచ్చాఅచ్చా! మరైతే వర్తకులూ, ఈ దివాణం దివాణంగానే మీ వాడలకి వస్తాం, లెండి.

వర్త.—మహాప్రసాదము! మహాప్రసాదము!

[అందఱు లేచి పరిక్రమింతురు.

సు.—[పరివారముతో] షికారీకి సర్వం సిద్ధమా?

పరి.—బందగానె అలీ, మీకి అందర్కి ఏనుగులు హౌదాలు వేసి తయ్యార్ వున్నవి. శిబ్బందికి గోడాలు జీన్ వేసి సిద్ధం వున్నవి. శుక్రం సిద్ధం.

సు.—భోత్ అచ్చా! ఈనజర్లు మాహౌదాలో అలంకరించి మాకంటికి విందుగా మాతోడానే వాడలికి తెండి. [పరివారము తెచ్చును. అందఱు పరిక్రమింతురు.

స్థలము. 2. ఓడ, లోతట్టు

[అంతట పడవకడుపులో తురకలందఱు ఉచితాసనముల నుపవిష్టులై ప్రవేశింతురు. బొమ్మలు తాంబూలము నిచ్చి హుక్కాలు ఇత్తురు, వీచోపులు వేయుదురు.]

సు.—[కైపుతో] వర్తకులూ, వాడలు మీవి కొంటాం మేము. ఇంత అద్భుతం వాడలు, ఈ దేశంలో చెయ్యలేరు. మేము సుల్తాన్ వున్నాం, నేటి మహల్ మే వున్నాం. ఈ యేటు ఖాదకం వుంది.

వర్త.—[ఆత్మగతము] వీనికి కైపెక్కుచున్నది. [ప్రకాశము] జగత్ప్రభువు చిత్తము,

సు.—అచ్ఛా! అచ్ఛా! [అని విశేషముగా నవ్వి, ఆత్మగతము] కైపుగా తోస్తుంది! [జాగ్రత్తతో] వర్తకులూ, నిన్నటి నాచిరంగు ఏదీ? అప్పట్నుంచి అక్కడ ఆడుతూనే వుందా? [ఆత్మగతము] కైఫ్ ఎక్కువ అవుతూవుంది. నాచిరంగు అప్పుడే మర్తబ్ అయింది. ఆడుతూవుందా అడుగుతాం.

ఒక వజీర్.—బందగానె ఆలీ, ఏమి యీ-యీ-యీ-దాని పేరు-రంగేను, ఆ! యీ విందు!

సు.—మనము బ్రతికి లేము. చచ్చి సీదస్వర్గం మే వున్నాము, నేను నమ్మాం. ఈ సౌదాగార్లదంతా ఆశ్చర్యం, అద్భుతం, తమాషా, చమత్కారం, గమ్మత్ వుంది.

వర్త.—[ఆత్మగతము] వీరెక్కడ నున్నారో వీరికి తెలియదు. వలీఖాను మఱియు వారు మాత్రము కైపు లేకున్నారు. [ప్రకాశము] జగత్ప్రభూ, మాదినదే మాడకేలి? జగత్ప్రభువువారు తెలుగుదేశము జయించిన కీర్తినాటకమును చూడవచ్చును.

సు.—మా కీర్తి నాకటం! మాకీర్తి నాకటం!

వర్త.—అవును. తమ కీర్తినాటకమే. దానిని మాదేశపు మహాకవులు తమ కోసము చేసినారు.

సు.—వజీర్సాహెబ్, బరేతమాష్! బరేతమాష్! నాకట మారంభించండి.

వలీ.—[ఆత్మగతము] బలే యమధర్మరాజు సహాయం! అతి సులభంగా వీళ్ల నందరిని సాఫ్ కిదా చేయవచ్చును,

వర్త.—మహానుగ్రహము! మహానుగ్రహము! ఆటగాండ్రను తెచ్చెదను.

[అని నిష్క్రమింతురు.

[అంతట వర్తకులు వలీపాత్రము సిపాయీలును ప్రవేశింతురు]

వలీపాత్రము.—బలే! బలే! పర్వం సిద్ధమా?

సిపా.—తప్రం సిద్ధం.

వలీపా.—మరి కదలండి. [ప్రయాణభేరి ఇతరవాద్యములును.

వలీపా.—మీరు ఈలడాయిలో యేమేమి పత్తి చూప్తారు చెప్పండి.

సిపా.—[ఒకరితోనొకరు] మనము గులాంద స్తఖైద్మునిషీచేత కట్టించుకొన్న పాటా కానిత్తాముగా. [అని సవాద్యముగా పాడుదురు.

ఒక సిపా.—[బొమ్మున చేయి యుంచుకొని] సర్దార్, నేను

మొఘలి ధాం కలోన యెఘిరే నా ఘసామి
రఘిలే యి న ము దాగే పఘిడీమియా.

[కడమ సిపాయిపాత్రములు వెంటఁ బాడుదురు.

మఱియొకఁడు.—[అట్లే] నేను సర్దార్,

నీ రంతా షారాయి నారంతా ఘంజాయి
జూరీ వి షా లేని పీరూ మియా.

ఇంకొకఁడు.—[అట్లే] నేను సర్దార్,

హాఖాషా నా ఫల్దీ లేఖాన్కి పార్వాల
ధీఖానీ యేషెటి షేఖూ మియా.

[సిపాయీ లందఱు కలిసి పాడుదురు.

* పీఖాల కీ కోపి హాఖాసా నీ కేపి
రాఖాసు లూ ళండి కేఖాలేస్తాం,
యేళ్ళన్ని కోశేశి నాళ్ళన్ని దోశేశి
ఊళ్ళన్ని బిల్వల్ల కాళ్ళు శేస్తాం.
యేన్గాల కొమ్మట్టి పీన్గాలు గా గొట్టి
గాన్గపెం టలుగా తున్గి యేస్తాం.

సు.—వహా వ్వా! వహా వ్వా! [వర్తకులతో] ఈ వస్తాదులు కూడా బొమ్మల్ చెయ్యలేక పోయినారా వర్తకులూ?

---

* పీఖాలకీ=గొంతుపీఁకలను.

వర్త.—జగత్ప్రభూ, గసజ్జ శేఖరా, ఈ వస్త్రాలు అందాలు బొమ్మ్గలే.

సు.—[పట్టి చూచి ఆశ్చర్యముతో ముక్కుమీద వ్రేలుంచుకొని] వర్తకులూ, మీది సర్వం మోసంవుంది. ఏమి వాశ్చర్యం! ఏమి వాశ్చర్యం! మీరు యీ లోకం వర్తకులు కారు. ఏలోకం వర్తకులు?

చెట్టి.—యమలోకం వర్తకులు. వెంగళప్పా, తెలివితక్కువ ప్రశ్నలు వేస్తావు?

వస్తాదులు, వర్తకులు.—[నవ్వుచు] దివాన్ నా బహద్దర్, నీవే ప్రళయకాలుండవు, మేమే కింకరులము.

చెట్టి.—అయితే మా కాయస్థుడు చిత్రగుప్తుడేడి?

వర్త.—చచ్చినవారిని యమునియెదుట మాటలాడ సిద్ధపఱచుచున్నాడు.

వలీషా.—[ఆత్మగతము] ఈ ఢిల్లీ యేలకపోతే నేను పఠాణ్ కాను. తెలంగీ దేశం కొల్లగొడ్తే రాజునకీ లూటీ విస్తారం వస్తుంది, అది నాకీ వశం వుంటుంది. ఈ లడాయిలో ఖుస్రూ చస్తే సంతోషం. బతికితే తర్వాత సఫాయి.

సు.—[వలీఖానుం జూచి] ఇదేమోయి యిది? యిట్వంటి ఆలోచనవుందా నీకి?

వలీఖాన్.—బందగాని అలీ. ఇదంతా అబద్ధ్, జూటా, వుత్తి నాటకం.

సు.—అవును వుత్తినాటకమే. కానీ చూస్తాం యింకా.

[ప్రకృత వ్యక్తులు ప్రవేశించును.

వలీషా.—మనం యిప్పుడు వోరంగోల్ చేరినాంగదా. యీదండు పట్నం పట్టడానికి ఖుస్రూతో ఛోడ్దేవు చేశి రాజాకి పట్టడానిక్కు జంగల్కు పోదాం.

సిపా.—సర్దార్ప్రత్గ. [ప్రయాణభేరి, ఇతర వాద్యములును.

సు.—అహో! వలీఖాన్, లడాయిలో రాజాకి పట్టినావా చెప్పినావే?

వలీఖాన్.—ఇదంతా జూటా నాటకం హుజూర్.

సు.—మంచిది, నాటకమే, చూస్తాం యింకా.

వలీషా.—మరి నడవండి. [అందఱు సవాద్యవాదనముగా పరిక్రమింతురు.

వలీషా.—అడవికి వచ్చినాం రాజాకి వెతక్కండి.

[సిపాయీలు చెదరి అన్వేషణ మభినయించుచు నిష్క్రమింతురు.

వలీషా.—రాజా నాకిదొరికితే ఢిల్లీకి తీస్కునిపోతాను. ఖుస్రూ ఇక చావనీ.

సు.—[వలీఖానుతో] ఆరేయేమిరా నీకి ఖుస్రూఖాన్మీద అంతా ఖాతిషి?

వలీఖాన్.—తమరు కైఫ్‌మే వున్నారు, తమకీ యిది అదీ తెలియడం లేదు. అరే నట్టువులు, యేమి నాట్యం యిది, జూటానాట్యం ఆడ్తారు? మాకీ సుల్తాన్వారికి ద్వేషం చేస్తారూ?

సు.—[కోపముతో] అరే! యేమిరా యింతా జబర్దస్తీ మాట్లాడ్తావ్?

వలీఖాన్.—లేదు అల్లా. నట్వ్యాలుతో మాట్లాడినాను. గులాంతల మీది.

సిపా.—[రాజును పట్టితెచ్చి] సర్దార్సాహేబ్, ఇద్గో రాజా మీ ఖయిది.

వలీపా.—ఆహా! రాజాకి పట్టినాను గదా!

శెట్టి.—నాకొక వెంగళప్ప ఒకపాటకట్టి నేర్పాడు. ఇది చూడకపోతే అది వినండేమి.

[అని లేచి ఆడుచు పాడును.

రాజు నేమో పట్టలేదు, రౌతు నేమో పట్టలేదు,
చాకలిపే రని వలీ సాయెబయ్య పట్టినాడు,
మంత్రిమాటకు మోసపోయి మంచిదుస్తులు నగలు దొడిగి
వేట వేసము వేసుకొని కాటిమొనలో గునుకుచున్న
చాకలిపే రని వలీ సాయెబయ్య పట్టినాడు
రాజు నేమో పట్టలేదు రౌతు నేమో పట్టలేదు, చాకలి...

సు.—[ఆత్మగతము] ఆహాహాహా ఎంత మోసం! ఎంత మోసం! [ప్రకాశము] అరే వలీ యేమిరా మహాల్వాలాకి మాచేత తాజీం యిచ్చినావు.

వలీఖాన్.—దివానాది పాటా నమ్మతారూ, నాదీమాటా నమ్మరు.

సు.—కానీ కానీ, అరే వర్తకులు, ఏమి మాకీ మోసం నాటకం చేస్తారు? మీకీ తల్కాయ అక్కర్లేదా?

పెద్దసెట్టి.—తలకాయ అక్కఱలేదా? తలకాయకోసమే యింతకొలువు. జగత్ప్రభూ, మేము తమ దర్శనమునకు వచ్చి మూఁడుమాసము లయినవి. వచ్చిన నాఁడే యీ యోడకు లంగరు దింపి కొంచెమవలికి జరుగుటకు మరల లంగ రెత్తఁగా లంగరుతో ఒక శవము మొండెము రాయి కట్టినది లేచినది.

సు.—తర్వాత తర్వాత?

వలీఖాన్.—[వర్తకులను సుల్తానును అత్యుగ్రముగాఁ జూచుచు, ఆత్మగతము] యమధర్మరాజా ప.హాయం మోసం వుందా? వచ్చినపని జర్గడానికి జగడం పెడ్తారు తోస్తుంది.

పెద్ద సెట్టి.—అంతట ఎవరో పాపము, ఎవరో చంపినారు, బంధువులు వెదక కొనివచ్చిన ఈయవచ్చును, అని ఆశవమును ఓడలో పెట్టితిమి. గట్టున నక్కలు గాంచి పోయి చూడఁగా తల యొకటి దొరకినది. అది ఈ మొండెమునకు సరిపోవుచున్నది.

సు.—తర్వాత? తర్వాత?

[వలీఖాను తన పత్నను వలెగ్గవ హెచ్చరిక సేయును.

పెద్ద సెట్టి.—అంతట మేటబంది చేసి ఔషధములచే ఆ శవమును ఈ గదిలో కాపాడియున్నాము. మతి మా గ్రహచారముచే శవము వెంటనే వచ్చిన వాని పిశాచము కూడ ఆ గదిలో చేరినది. రాత్రులెల్ల అందులో హో యని యేడ్పులు. ఎందఱికో మా కళాసులకు ఆ భయముచే జ్వరములు. ఎందఱినో ఆ పిశాచము పట్టి మా పురోహితులు ధూపము వేసిన పలుకుచు, ఖాను ఖుస్రూఖాను—

సు.—[ఆశ్చర్యముతో] ఆ! ఆ! ఆ! ఏమి? ఏమి?

[వలీఖాను కత్తి దూయును, అతని పత్నను వారించ యుండును.

పెద్ద సెట్టి.—[వణఁకుచు] తన్ను వలీఖాన్ చంపినాఁడని, సుల్తానువారితో చెప్పుమని యేడ్చును. తమతో చెప్పిన తర్వాత దానిని పోఁగొట్టుకొందమని యింతకాలము ఇంత కష్టపడినారము.

[వలీఖాను సుల్తానును పొడువఁబోవును. పెద్ద సెట్టి వలీకత్తిని లాగి వేసి వానిని పెడ రెక్కలు విఱిచికట్టును. సిపాయి పాత్రములు వలీఖానును మిస్త్రి అను ఆజ్ఞ చేయుదురు.

సు.—అరే! యీ ఆశ్చర్యాలలో మాకై పుగయూ, అంతా పట్టపగలా వుంది. అరే! అరే! ఊటానాటకం చెప్పినావు! యింతాద్రోహీరా నీవు! నీవు మాకీ గామా రైకీ యిచ్చి పెళ్లిచేస్తావు! విందూ చెప్పి యింటికి తీస్కొనిపోయి చంపడానికి, నిశ్చయం! అహో ఆశ్చర్యం! ఎంతాద్రోహీ! ఎంతాద్రోహి! మాకీ చంపే యీ పాపి మా ఖుస్రూకీ చంపినాడులో సందేహం యేమి? అరే ఖుస్రూ! అరే ఖుస్రూ! అరెరాగ్య ఖుస్రూ! వాడు మా బిడ్డా, వాడు మా కూనా, వాడు మగ్గయా, మేము మగ్గయూ.

[అంతట గదినుండి ఖుస్రూ శవము పిశాచాధిష్ఠితమై వచ్చును. వర్తకులు గడగడ వణఁకుదురు. వలీఖాను భయవిభ్రాంతుఁడై దూరము జరుగుదురు, ఆజ్ఞ సుల్తాను వడవడ వణఁకును.

సు.—[భీతినాటికముతో] మాడుమాపం ఖూనా శేళ సాగ్కిన దవడలు, చిక్కినశవం, ఎండుతాటికాయలాగ తల్కాయ, ఎండుతాటిబొందలాగ మొండెం, వీడికి చూస్తే మాకే గుండె తవ్వని పోతుంది! గాభరా వుంది! క్యాకరూ!

ఖుస్రూ —[పెద్దగోదనముతో] మేరే బాబ్, ఘయాజ్ ఉడ్డీన్ టోగ్లాక్ సుల్తాన్, బందగాసె అలీ, నాకీ వలీ చంపినాడు. లడాయిలో చావలేదు. బిసాత్ ప్రాణం దొంగచేతా చచ్చింది. వీడు రాజాకి పట్టలేదు. చాకలికి పట్టినాడు.

[సుల్తాన్ విభ్రాంతుఁడై వినును.

పెత్తి.—[వలీఖానును తన్ని దొరలించుచు] 'దివానాది పాటా నమ్ముతారు, నాది మాటా నమ్మరు.'

[వలీ వణఁకును

ఖుస్రూ.—రాజా తర్వాత వచ్చినాడు. లాడాయి ఐంది, మన దండంతా మర్గయా. నేను మేరే బాబ్, మేరే బాబ్, మేరే బాబ్, తమపాదాల్ దర్శణం కోషం పరారిచేసి ఢిల్లీకి వచ్చినాను.

[సు. వణఁకుచు ఏడ్చును. సుల్తాన్ పక్షము వజీర్లును వణఁకుచు ఏడ్తురు. వలీ కన్నులు మూసికొనును.

ఖుస్రూ.—వీడు సర్దార్గదా అని, వీడు సర్దార్గదా అని, వీనికి దర్శణంచేసి, నీవుచాకలికి తెచ్చినావు చెప్పినానుబాబ్, నాతో చెప్పగద్దు అన్నాడ్. తప్పకుండా నేను చెప్తాన్ అన్నాను. అయితే పోనీ సిఖాగోవ్దాం చెప్పి, కబుర్లడుగుతూ, ఇక్కడిక్కి వచ్చి అద్గో అక్డ చూడు చెప్పి యిద్గో యిక్డ నాతల కొట్టినాడ్ బాబ్, మేరేబాబ్.

[వలీ. మూర్ఛిల్లును.

ఖుస్రూ.—వాడిక్కి అట్లా మీరు తలాక్కాయ కొట్టించి నాకీ గోరికట్టిస్తే నా పోత్మ హల్లాకాడికి పోతుంది.

సు.—[కన్నీళ్లతో వణఁకుచు]యిస్తే వాడిక్కి శాస్త్రీ చేస్తాం,నీకి బంగారం గోరీకడ్తాం. ఏడవకు హల్లాకాడిక్కిపో. అహాహా, మూడుమాసాల్కింద దివానా గోడ్ గస్తీజవాన్లు వీడికి చూచినాం చెప్పినార్. ఈవలీ పాపి జూటాభాత్ అన్నాడ్. మాకీ యుద్ధంలో ఖుస్రూ మర్గయా చెప్పినాడ్.

[వలీఖాన్ మూర్ఛతేరును.

ఖుస్రూ.—మేరేబాబ్కి సలామతీ. నే నీదేఘం తమకిదప్పగించి అల్లాకాడిక్కి పోతావున్నాను.

[ఖుస్రూ కళేబరమునుండి చెపముకిశాస్త్రి వెలువడి కళేబరమును త్రోసి వలీకిమాత్ర మగపడి చాటువకు పోవును.

వలీఖాన్.—[చెపముకిశాస్త్రిఁ గని] హా! హా! హా! యంధర్మరాజా!

[అందఱు కళేబరమును దరిసి కని ఆశ్చర్యపడుదురు.

సెట్టి.—నన్ను పిలుస్తావా?

సు.—అరే గాడిదా, యమధర్మ రాజేమిరా?

పెద్దసెట్టి.—[వణఁకుచు]చావఁబోవువానికి, ఇది హింసించునావ గనుక యమ ధర్మరా జగపడినాఁడు.

సు.—వీడ్కి మేము యంధర్మరాజ్ అవుతాం.

[అని వలీఖానుతలను కొట్టఁబోవును.

పెద్దసెట్టి.—కట్టినవానిని తమరు కొట్టఁగూడదు, అంగరక్షకుల కాజ్ఞ చేయుఁడు.

వజీర్లు.—అవును. బందగాను అర్జీ, మేము చెప్తాం. ఎవర్రా అక్కడ! ఈ పాపాత్ములకి తీస్కపోయి తలకొట్టి రాయిగట్టి జమ్నాసే వేయ్యండి. అగ సర్కార్ ఆజ్ఞ.

అంగరక్షకులు.—సర్కార్ చిత్తం. [అని కొనిపోవుదురు.

పెద్దసెట్టి.—[ఒక వర్తకునితో అపవారించి]వగీతల తెచ్చి భద్రముచేయుము.

[వర్తకుఁడు నిష్క్రమి. గుభిల్ గుభిల్ అని నీటిలో వేసిన శబ్దములు అగును. గుండ్లు మ్రోఁగును.

[అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.]

వర్త.—వీరే మా పురోహితులు.

సు.—ఓహో చిత్రగుప్త జోస్యులు!

[చెకుముకి వలీఖానుని ఖరారునామా సుల్తానుచేతి కిచ్చును.

సు.—[చదువుకొని] అహా! మాకి యీ రాత్రి చంపడానికి వగాడు సెలవ్ పత్ర. ఇది వాడిదే దస్తూరి. ఇది వాడిదే దస్కత్. ఇవి వా డెవర్కి రాసినాఁడు?

చెకు.—ఎవరికో? ఈ చీటి ఒకనాఁడు జగత్ప్రభువువారి యాస్థానమున సభ లేచినపిమ్మట నాకు దొరకినది. ఆ శత్రువు అందఱు తమకు దొగకుట్టై, ఇప్పటివఱకు నేను దీనిని దాఁచితిని. ఈవర్తకులకు ఈకుట్ర తెలిపితిని. వానియింట జగత్ప్రభువు నకు విందు తప్పించి వారివిషయమున తమకు చేసిన నౌకరి తమకు ప్రత్యక్షమే.

సు.—వారిచేత బతికినాం. మీ వుపకారానికి చాలా సంతోషం! హా యేమి రాత్రియిది! వీడ్కి షేం సిఫాయి మొదల్ ఫౌజ్దార్ చేశి, సర్వసేనాపతి చేసి, ధనం ఇచ్చి మర్యాదల్ యిచ్చి, వజీర్ చేసి, మొదల్ వజీరు చేసినాం మా! యింతా ద్రోహం చేసినాడు! హా హా హా!

చెన.—మఱి శయనింపుఁడు, సర్వము సిద్ధము. నాతో రండు. కొంచెము షర్బత్తు పుచ్చుకొనుఁడు, ఆయాసము తీఱును.

వజీర్లు.—అట్లా చేయుండి.

[చెనముకి షర్బత్తు ఇచ్చును. సుల్తాను త్రాగును. వజీర్లును చెనముకియు సుల్తానును శయనగృహమునకు తోడ్కొని నిష్క్రమింతురు.

[అంతట రాజు ప్రవేశించును]

వెట్టి.—పెద్దసెట్టీ, మహారాజునకు మంగళవేష మొసంగుము.

పెద్దసెట్టి.—శుభము శుభము శుభము. తమరును మంగళవేషము ధరింపుఁడు.

[అని వెట్టివానికి మంత్రివస్త్రములు ఇచ్చి, రాజునకు వస్త్రములను ఆభరణములను తెచ్చియిచ్చును. వెట్టివాఁడు మహామంత్రివేషము ధరించును.

పెద్దసెట్టి.—జయము జయము మహామంత్రి యౌగంధరులవారికి.

చెన.—[ప్రవేశించి యౌగంధరునిం గని] జయము జయము యమధర్మరాజ మహామంత్రిగారికి. [రాజుం గని] ఈ యుమసభలో సౌదాగరులవారు దేనికి వెలల వేయుచున్నారు?

[అగాదు. యౌగం. తల ఆడించును.

రాజు.—[రాజవేషధారణమును ముగించుచు] వెల గలవానికి వేయఁగలమే గాని లేనివానికి వేయఁగలమా?

చెన.—వెలలేని సరకులుం గలవా యీ వర్తకులయొద్ద?

[ఆగాదు. యౌగం. తల ఆడించును.

రాజు.—[ముగించి తటాలున యౌగంధరునిపాదములు పట్టుకొని, హర్షాశ్రుగద్గదముగా] ఈ యౌగ్మమునకు వెలగలదా శాస్త్రులవారూ?

ఉ. [1]శ్రీదయితుండు [2]దానవులఁ [3]జెండి విజాశ్రితు నింద్రుఁ బ్రోచిన
ట్లాదట నాయరాతుల వెలార్చి నను న్నతతంబుఁ బ్రోచుచున్,
[4]శ్రీదునిఁ జేదఁ జేద నలశ్రీదు నొనర్చి విధి న్హసించు నీ
పాదసరోరుహద్వయికిఁ బ్రాజ్ఞవరేణ్య, వచింపు మూల్యమున్. 3

[అని యాపాదములను బాష్పముల దడుపును.

అందఱు.—లేదు, లేదు, లేదు. [మూఁడు అగాదులు

యౌగం.—లేలెమ్ము వత్సా. [అని రాజును లేపి కూర్చుండబెట్టి] దైవికము తంత్రీ, ఖేదపడకు.

రాజు.—తమ యాజ్ఞ మీఱిన దోషమే, దైవదోషము గాదు.

యుగం.—వత్సా, గతమునకు చింతిల్లకు.

ఉ. రాణ్ణి ధరిత్రి నీ కఖిలరాజులు దండనతు ల్రచింప, వి
న్నాణపుమౌళికెంపులఘనద్యుతి నల్గడఁ జుట్టువాఱుచో,
జాణను నిన్వరించు నలశాత్రవలక్ష్మిని బెండ్లియాడఁ బా
రాణియలంకృతిం బడయు రాజశిఖామణి. నీపదాబ్జముల్.

రాజు.—మహాప్రసాదము, మహాప్రసాదము.

యుగం.—వత్సా, నీ బాహుభాగ్యమును వీరి భక్తివిశ్వాసములు భావించినవి.

రాజు.—నా సుకృత భాగ్యమును గావించినవి.

యుగం.—పెద్దసెట్టీ, బాల్యమున మా సహాధ్యాయివి సహక్రీడివియు నైన స్నేహవిశ్వాసములను పూర్ణముగా చెల్లించితివి.

పెద్దసెట్టి.—కంటికి ఱెప్పలవలె సదా రక్షకుల రగు తమకు నాచేయుం గొలువునకు ప్రశంస యేల?

రాజు.—ఆచంద్రార్కము ప్రశంసనీయము మీ యందలి విశ్వాసము.

పెద్దసెట్టి.—ఏలినవారు ఒక కొన్నియేని నిజమంగళాలంకారములు ధరింప రాదా?

రాజు.—విశ్వనాథక్షేత్రమున ప్రాయశ్చిత్తమై, విశ్వనాథపూజగావు, [యుగంధరుని పాదములు చూపుచు] ఈ పాదములను నాస్వహస్తములఁ బూజించిన పిదప.

చెకు.—తురకలు తిండికి లేకఁ గాసీ అంగరు లెత్తినారము. నిద్ర లేఁగిసంత చేఁప లెత్తినారము. ఉభయవేగములఁ బోవుచున్నవి. లేకు విశ్వనాథసేవ.

యుగం.—మఱి అందఱు విశ్రమింపుఁడు.

ఆ. సెట్టి యొకఁడు, నేనుఁ జెకుముకిశాస్త్రియు,
కాలరుద్రు మూఁడుకనులభంగి,
మేము మువ్వురమును మేల్కొని యుందుము,
ప్రభువు విశ్రమంబు బడయుఁగాక.

[అందఱు నిష్క్రమింతురు.

# నవమాంకము

స్థలము : ఓరుగల్లు, ప్రతాపరుద్రమహారాజా నాస్థానమ[redacted]

[ప్రతాపరుద్రుఁడు సురత్రాణుఁడు, వజీర్లు, జనార్దన విద్యానాథ చెనుముకులు, విశ్వాసరావు, బహుపరివారముతో ప్రవేశించి యుపవేశింతురు.

సు.—మీ ఢౌలత్ ఖాలీఫ్ హారూనల్ రషీద్ వారికి వుండింది తోస్తుంది. మీ బడామంత్రి యుగంధర్ వారికి మాకన్నాతో చూడవాలా కోర్తాం.

సు.—మీ మంతిరిగారికి ఎంతా గౌరవం ఐనా సరీ వుంటుంది.

[వాద్యములు మ్రోఁగును.

రాజు.—వచ్చుచున్నారు, మన మెదుగవోయి తోడ్కొని రావలయును.

[అందఱు లేచి ఎదురు నడతురు. యుగంధరునితో అందఱు మరలి వత్తురు.

రాజు.-[యుగంధరునితో] కూర్చుండుఁడు. [అని ఆసీనుం జేసి ప్రణమిల్లును.

యుగం.—సర్వాభ్యుదయోఽస్తు.

రాజు.—తమ దర్శనము కొఱకు కనిపెట్టుకొని యున్నారు సుల్తాను గారు. నిజనగరమునకుఁ బోవ త్వరపడుచున్నారు.

సు.—సలాం యుగంధర్ మహామంతిరిగారికి.

యుగం.—సలాం. మాయింట ఆఱుమాసము లయిన నిలువక ఆఱుదినము లకే విసివిరా సుల్తాన్‌వారు?

సు.—తమరు చేసే సత్కారం, గౌరవం, మర్యాదావల్ల యావజ్జీవం మీ ఘర్లో వుండడమే మాకీ యిష్టం. అయితే పోవడాన్కి కోరడాన్కి కారణాన్కి మహామంతిరిగారు యెరుగుదురు కే యెరుగుదురు. దయా వుంచి శెలవు దయచెయ్యవాలా కోర్తాము.

యుగం.—ఇఁక వారిని నిలిపిన, వారికి వారికై యున్విశ్వాసమును వారికిం గూడ సాపరాధుల మగుదుము. వా రెచటనున్నారో నిజనగరమునఁ దెలియదు, కావున వారిని పంపుట యుచితము.

సు.—మహారాజ్, మేము దైవంచేష్టాచేత ఆవాడలోపడ్డాం, మీకిదొరికినాం ఈయన పట్టినాడు మాకీ? మీరు ఈయనకీ అబ్బంకీర్తి చేస్తారు తోస్తుంది.

చెన్న.— "అల్లవా డిల్లహో యిల్లవా డల్లహో
కల్లులేని కబోది కడ తేరలేదు."

సు.—చితగు ప్తర్నోస్యులా, మేము కబోదీ చేస్తావా? వుంగు వుంగు. [స్మరణమభినయించి] షోస్యులా, మాతో వచ్చినాడు ఆ దివానా యేమైనాడు? అహో వాడ్ని కూడా సంపీ యేశినారా!

చెను.—వాండే అందరిని చంపి వేసినాండు. వాని నెవండు చంపంగలవాండు!

సు.—మరి యేమైనాడు!

రాజు.—మీయెదుట నే యున్నాండు.

సు.—మాకీ అంతా సందేహం, ఆ దివానా దివానా అబ్బం, మీ తంత్రాల్లో మేమూ దివానా వున్నాం మహారాజ్.

రాజు.—వారే. [అని మోదుప్రోలితో యుగంధరుని చూపును.

[సుల్తాన్. వజీర్గను ముఖ్యునిగాంచి ప్రేలుం చుకొనును.

సు.—అల్లా! అల్లా! అల్లా! అందుకీ మీరు గం మేషగంలో మాగ్గరా ఫుష్కగ చేసినారు. తమరు యుగంధర్ మహామంత్రి గారు మనకీ నిజం కబోదీ చేసినారు.

యుగం.—అంతయు మీ వజీర్లు విశదీకరింతురు.

సు.—[దిగులుతో] మీరుకూడా వరీవపోయి వజీర్లు! అల్లా అల్లా అల్లా! ఇంకా యేమి తల్చినారు మాకీ యుగంధర్ మహారాజ్? [అని వజీర్లవ మురము గా నిలిచి] యిది మల్లీ వాడారాత్రి అవుతుందా యుగంధర్ మహారాజ్?

యుగం.—అట్లు కానేరదు. శివునిగూర్చి లేక సామయము సల్లాము. మీ వజీర్లు బుద్ధిమంతులు, ఊహించి చెప్పుదురని మామాట. క్రమాక్రమముగా మీరెరింగిన ఈ స్వారస్యము; మావలన విదవలదు. మీకు యావజ్జీవము బుద్ధికి ఇది యొక కనోద వ్యాపారమగుంగాక,

సు.—హబ్బ! మీ మాట చేత గాథరా తీరింది మహారాజ్. ఆ మహారాజా అన్నిమాట్లు పట్టిన ఆ పాదాల్కి మేము వఖ్యాటు పట్టుతాం. [అని తటాలున యుగంధరుని పాదములు సోక సలాముచేసి] మీరు యెటువంటో వాకశాగం. మాకీ వరమియ్యండి సామీ. మీదర్శనం యట్వంటి పాపాత్ముడికీ మేలు చేస్తుంది.

యుగం.—[సుల్తాను చేయి ప్రతాపరుద్రుని చేయికలిపి] మీ కిరువురకు సఖ్యము చేయుచున్నాను.

క. మయశంబరులకుబలె [1]న్వయపారంపరిగ సఖ్య మమరుత మీరుగా,
నయముగ నొందొరులకు [2]రిపు భయదాహవములను దోడుపడుదురు గాతన్.

1 అన్వ...=వంశపరంపరగా. 2 శత్రువులకు భయంకరములయిన యుద్ధములందు.

సు.—ప్రతా, వజీర్లు, చెకుముకి ప్రభృతులు—కోరిక గాదు, వరము వరము వరము.

సు.—మా జ్ఞాపకం తమకాడ వుండవాలా.

[అని యుగంధరునికి తనకత్తి ఇచ్చి, తన పగిడీ ఇడి, తాను పాగా ధరించును.

రాజు.—మాగుర్తు తమయొద్ద నుండవలయును. [అని సుకు పగిడీకత్తి ఇచ్చును

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులవారికి. పెద్దశెట్టిగారు వచ్చియున్నారు.

రాజు.—రమ్మను.

[అంతట పెద్దసెట్టి ప్రభృతులు ప్రవేశింతురు]

వర్త.—జయము జయము జగదీశ్వరులవారికి. జయము జయము మహామంత్రి యుగంధరులవారికి. ఓహో! సలాము సలాము సుల్తానువారికి. సలాము సలాము వజీర్లాయివారికి.

సు.—వజీర్లు.—సలాం సలాం.

సు.—[ఆత్మగతము] వీళ్లకి కొట్టి రాజాసర్దార్లు మాకి పట్టితెచ్చినారు. వీళ్లు హిందూగ్కీకి పోయినాగు. వీళ్లు నోవావర్తకులు, రాజా మర్దయా మంత్రి మర్దయా చెప్పినాగు. వట్టి ఖుట్టి అంతా షైహీతులు. అరె! హల్లా! హల్లా!

రాజు.—[విద్యా-తో] మహానుభావా, తమ కొమారితకు వివాహమైనదా?

విద్యా.—[ఆత్మగతము] కృతికన్యం గూర్చి పలికెదఁగాక, [ప్రకాశము] మహారాజా, అల్లుఁడు కాశిలో నుండఁగా ఇట వివాహమెట్లగును?

రాజు.—[ఆత్మగతము] కృతింగూర్చి పలుకుచున్నాఁడు మహాకవి. [ప్రకాశము] వచ్చునుగదా కాశీనుండి?

విద్యా.—ఇదిగో కానిచ్చెద. 'తదేవలగ్నం సుదినం తదేవ విద్యాబలం బుద్ధిబలం తదేవ ...

[అని ప్రతాపరుద్రీయగ్రంథమును విప్పి ఒకటిరెండు శ్లోకములం జదువును (29-30. పుటలు. చూ.) చెకుముకి అర్థము చెప్పును. విద్యానాథుఁడు గ్రంథమును రాజునకిచ్చును. రాజు లేచి సనమస్కారముగా గ్రహించి కూర్చుండును.

విద్యా.—ఇట్టివరులు హారణము కోరరు గాని హారణహీనముగా కన్యనిచ్చుట కన్యాజనకులకు పరువు తక్కువ కావున ఈ యలంకారమును గ్రహింపవలయును.

[అని రాజు వ్రేల ముద్దుటుంగరమును తొడుగును.

[నేపథ్యమున దుందుభులు పుష్పవృష్టియు]

రాజు.—[నమస్కరించి, మోడ్పుఁగేలితో] అంతటను వానినే తగులకసిని నంతరిగదా.

ప్రతాప.—[ప్రతిహారి] పేర తగిలియున్నదో లేదో చూచుకొనుఁడు.

[నేపథ్యమున దుందుభులు పుష్పవృష్టియు]

[యుగంధరుఁడు రాజు చేతికి కొన్ని శాసనము లిచ్చును.

రాజు.—[చూచి ఆనందించి] విశ్వాసరావు, వీనిని అందింపుము.

[అని ఒక్కొక్కటిగా చూచి యిచ్చును. విశ్వాసరావు వరుసగా

విద్యా. చెన్న. బేతాళ. నరసిం. పెద్ద స.—వీరికి ఇచ్చును.

యుగం.—ఏలినవారు మిమ్ము నందఱను దేశాధీశ్వరులను చేసినారు, మిత్ర గోష్ఠిగా మర్యాద నిబంధించినారు. [రాజునుగూర్చి] వత్సా, నీ కింక నేగాని మనోరథం బున్న వచింపుము

రాజు.—మహానుభావా.

శా. ఢిల్లీనాథుని మిత్త్రుఁ జేసితివి, [1] ధాటీధర్మ బాహ్యాత్ముఁ డౌ
వల్లీఖానుశిరంబుఁ దెచ్చితి, [2] ద్విషద్బందీకృతుల్ మత్ప్రజల్
ఇ ల్లొందించితి చాకినేని, [3] గజరా జేఁగెల్ యము న్గానఁగా,
నల్లాపింపుమ యింకనుం గలుగునే, సర్వజ్ఞ, [4] యాశాన్యముల్! ౬
అయిన నిది యగుఁ గాక.

[భరతవాక్యము]

(మాలిని)

వానలు లోకశివం బకృశంబుగ వాసవుఁ డిచ్చుతఁ గాలమునన్,
దేనియు జాల్కొన దేశము పండుత దివ్యలఁ దన్పుత యాగపరుల్.
మానిత మౌనమార్గముఁ దప్పక మంతురుగాక నృపు ల్లగతిన్
భూనుతలోకవిపుంగవులం బొరపొచ్చెము సేయక గాక బుధుల్. ౭

సమాప్తము

1 దాడియొక్క న్యాయమునకు వెలియయిన హృదయముగలవాఁడు. 2 శత్రువులచేత చెఱఁబెట్టఁబడినవానిని. 3 కటకబల్లహుఁడు. 4 కోరఁదగినవి,

PRINTED BY

Vedam Venkataraya Sastry & Bros.,
VEDAM PRINTERS, MADRAS—1

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4, మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీథి, మద్రాస్ - 1

ఆర్డరుతో కూడ సగము సొమ్ము అడ్వాన్సు పంపవలెను.
ప్యాకింగు, తపాలుచార్జీలు వేరు. పూర్తి వి. పి. పద్ధతి లేదు.

## సంస్కృత గ్రంథములు

| | | |
|---|---|---|
| అభిజ్ఞానశాకున్తల నాటకము, శ్రీమాన్ నేలటూరు రామదాస అయ్యంగార్ గారి తెలుగు వ్యాఖ్యానముతో | (అచ్చులో) | |
| రఘువంశము, సటీక మొదటి 3 సర్గలు 4 00; సర్గలు 4. 5, 6. | 4 | 00 |
| మేఘసందేశము, మల్లినాథ వ్యాఖ్య, తెలుగు టీకాతాత్పర్యాదులు | 8 | 00 |
| కుమారసంభవము, మొదటి 6 సర్గలు, టీకాతాత్పర్యాదులు | (అచ్చులో) | |
| అమరుకావ్యము, వేమభూపాలవ్యాఖ్య, సంపూర్ణాంధ్రటీక. | 3 | 00 |
| రసమంజరి, శృంగారరసస్వరూపము, సటీక క్రొత్త యచ్చు | 3 | 00 |
| పంచతంత్రము, మూలము మాత్రము. | (అచ్చులో) | |
| దశకుమార చరిత్రము, మూలముమాత్రము (పాతప్రతి) | 2 | 00 |
| ,, ఆంధ్రానువాదము ( ,, ) | 2 | 00 |

## ఆంధ్ర పద్య కావ్యములు

| | | |
|---|---|---|
| ఆముక్తమాల్యద, సంజీవనీవ్యాఖ్యతో, ద్వితీయముద్రణము | 36 | 00 |
| శృంగారనైషధము, సర్వంకషవ్యాఖ్య, తృతీయముద్రణము. | [అచ్చులో] | |
| జ్ఞానవాసిష్ఠ రామాయణము, [వేదాంతము] మడికి సింగనకవి | 3 | 00 |
| ఆంధ్రబిల్హణీయము [పాతప్రతి] మూలము మాత్రము | 1 | 00 |
| కేయూరబాహుచరిత్రము, మంచనకవి, ఆలువేల వెలనాటి చరిత్రతో | 4 | 00 |

## లక్షణ గ్రంథములు

| | | |
|---|---|---|
| కావ్యాలంకారచూడామణి, ఉపోద్ఘాతముతో | 5 | 00 |
| ఆంధ్రసాహిత్యదర్పణము, 1—5 పరిచ్ఛేదములు 1 భాగము | 4 | 00 |
| అలంకారసారసంగ్రహము, అర్థాలంకారములు టీకాతాత్పర్యములతో | 1 | 00 |
| ఛందస్సు, సులువు సంగ్రహము, విద్యార్థుల కుపయోగకరము | 0 | 50 |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రతాపరుద్రీయ నాటకము | 6 | 00 | ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము | 4 | 00 |
| ఉషానాటకము | 2 | 00 | ప్రియదర్శికా నాటిక | (అచ్చులో) | |
| బొబ్బిలియుద్ధనాటకము | 4 | 00 | నాగానందనాటకము | 2 | 50 |
| విక్రమోర్వశీయము | [అచ్చులో] | | రత్నావళీ నాటిక | (అచ్చులో) | |
| మాళవికాగ్నిమిత్రము | 3 | 00 | ఉత్తరరామచరిత్రము | 5 | 00 |

